# ఈ నాటకమున వచ్చు పాత్రములు.

## పురుషులు.

ఉదయనుఁడు లేక వత్సరాజు — కథానాయకుఁడు ; వంశరాజ్యాధిపతి.

ప్రద్యోతనుఁడు — అవంతిరాజు ; వాసవదత్త తండ్రి

ప్రభాకరుఁడు — ప్రద్యోతనుని మంత్రి

భాస్వంతుఁడు, భైరవుఁడు — రాజబంధువులు

విజయుఁడు — సూతుఁడు

యౌగంధరాయణుఁడు — ఉదయనుని మంత్రి

చండభానుఁడు — వాసవదత్తను మోహించిన ఖలుఁడు

జయశర్మ — బ్రాహ్మణుఁడు ; ఇందిర తండ్రి

వామదేవుఁడు — తలారి

దామోదరుఁడు, శంకరుఁడు — ఇద్దఱు బ్రాహ్మణులు

దౌవారికుఁడు — భటులు — శిష్యులు — మొ॥

## స్త్రీలు.

వాసవదత్త — కథానాయిక

ఇందిర, మనోరమ, రాజముఖి, మాలతి — వాసవదత్త నెచ్చెలులు

మలయవతి — ప్రద్యోతనుని భార్య

# కృతిప్రశంస.



కావ్యేషు నాటకా రమ్యాః—అని ఆభాణకము. ఏల రమ్యములు?—అన్నచో అతీంద్రియమగు రసస్వర్గమును ఇంద్రియగోచరమొనర్చి ప్రత్యక్షీకరించును గనుక కాఁబట్టియే ప్రాచీనులు నాటకాంతం కవిత్వ-మ్మనిరి. నేఁడో నాటకాద్యం కవిత్వం—అయినది ఆంధ్రదేశస్థితి. ఇందులకు అనుతప్తము కానట్టివిపశ్చిల్లోకముండదు. అయినను అచటనచటఁ బొడసూపు కవికుమారులదృశ్యకావ్యసృష్టి యీఅనుతప్తహృదయముల నాశ్వాసింపఁజాలినదియై కనఁబడుచున్నది. ఇందువలననే రసవ్యగ్రహృదయములకు జీవన్భద్రాణి పశ్యతి—యనువాక్యము సార్థకమై యూరటనిచ్చుచున్నది. ప్రకృతము ప్రకాశ్యమానమగు నీకృతి అట్టిశైత్యోపచారములకుఁ జెందినవాని లో నొకటి. దీనిని రచించినకవియు నట్టిప్రజ్ఞాశాలియే. యువకులును భావకులును రచనాకల్పులునై యున్నారు.

బ్ర॥ శ్రీ॥ శిష్టా వేంకటసుబ్బయ్యగారి యీవాసవదత్తకు ప్రధానమగుమూలము కీ॥ శే॥ లక్ష్మణరావు పంతులుగారి హిందూదేశకథాసంగ్రహము. అలదానికి కథాసరిత్సాగరాదులు. చారిత్రకమగుటచేఁ గాబోలు లక్ష్మణరాయలకథకును కథాసరిత్సాగరకథకును గొంతయంతరము కలదు. అది యమూలమా? లేక సమూలమా?—యన్నచర్చతో నాకంత ప్రసక్తి లేదు. కాని పౌరాణికథమాత్రము చారిత్రికాంగీకృతమైనందులకే నాయాశ్చర్యము! అస్తు.

ఉదయనునికథ లనంతకాలమునుండి ఆమహామహుని యశశ్చంద్రికల నిరంతరము వెదచల్లుచునే యున్నవి. మహాకవి కాళిదా

సునంతటివాఁడు 'ఉదయనకథాకోవిదగ్రామవృద్ధైః'—అని యుట్టంకించినాఁడు. ఆమహోదారునికథలు తత్పరితలనుకూడ కోవిదులనుఁ జేయునట్టివి. కాకున్నచో నట్లేల ఉల్లేఖించుట గల్గును? అంతటి ఉదాత్తనాయకుని మానసమును సైతము చూఱఁగొన్నది వాసవదత్త. బంగారునకు సైతము వన్నెవెట్టు అనర్ఘరత్నజాతికి చేరిన స్త్రీరత్న మీమె.

ప్రస్తుత వాసవదత్తయందును ఆనాయికయే కథానాయిక. నాయకుఁడుకూడ నతఁడే. కాని చారిత్రకపుపునాదిపై రసమహితములగు కల్పనలతో అసలునకుఁగూడ వనగల్పించిన దీవాసవదత్త. వత్సేశునం దనురక్తయై వాసవదత్త సిద్ధమూలికాగ్రహణార్థ మను నెపమున వెడలినట్లున్న లక్ష్మణరాయలకథాంశమును చండభానుని మాయోపాయవిచ్ఛేదనమునకై వత్సేశుని ప్రేమతోఁ బ్రత్యక్షముగాఁ ద్రొక్కిఁపవలయు నన్నమిషతో వెడలినట్లు లీ కవి మార్పు చేసిన ఘట్టము ఇందులకు తార్కాణము. ఇది ధీరోదాత్తయగునాయికకు తగియున్నది.

'య త్స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా'—యని లక్షణవేత్తల యనుశాసనము. దానినమపరించుచోఁ వత్సేశ్వరు నావర్జించుటకై ఏమియుపాయమా? యన్న ఆలోచనములో నున్న ప్రద్యోతనుని కోర్కను ఆపిమ్మట హస్తిమృగయాత్యాసక్తుఁడై నిర్భీకుఁడై యరివీరుల నొక్కఁడ యుక్కాడువత్సరాజుచేయు మృగయావిహారమును అయ్యెడనున యంత్రగజముచే వత్సేశుని బందీకృతుఁ గావించి ప్రద్యోతనుఁడు వత్సరాజును పట్టితెప్పించినసందర్భమును సఫక్కినిఁ గూర్పఁబడినవి. కాని వత్సరాజు వెన్వెంట ఛాయాను

కారియై వర్తించు యౌగంధరాయణుని ప్రజ్ఞాధిక్యము ఇట్టి ప్రద్యోతుల లక్షమందినేని ఖద్యోతులఁ జేయఁజాలినది. కనుకనే ఆతఁడు శంకరమునిరూపునఁ జేసిన విచిత్రకల్పనలును యుక్తులును చూపరుల నివ్వెఱ నొందింపఁజేయఁ జాలుచున్నవి. ప్రద్యోతనునికిఁగల గజశాస్త్రప్రవర్తనాభిలాష యౌగంధరాయణుని రాచకీయపుటెత్తులకు వశమై యువ్వెత్తుగా నొక్కమాఱుగా తననుఁ గట్టత్రాళ్ళఁ దాఁ దెచ్చుకొన్నట్లొనరించినది.

నాయికాగుణకీర్తనాదులు నాయకహృదయముల నావర్జించు సాధనము లందురు. ప్రస్తుత మీకృతిలోఁదొలుదొల్త అపరిచితముగనే నాయికానాయకులకు సందర్శనముఁ గల్గించి చండభానురూపమున నొక్కింత యెడఁబాటును ఒనఁగూర్చి నాయికానాయకుల యనురాగవాహినిని యుబికించి ఆపిమ్మట విద్యాపరీక్షణవ్యాజమున సాముఖ్యమును గల్గించి గట్టుదాటి ప్రవహించునట్లు చేసి శృంగారపోషణమునకు చక్కనిస్థితిని ఈకవి కల్గించినాఁడు. అఘట్టము పఠితలకును ద్రష్టలకును చాలముదముఁ గల్గించుచు నున్నయది. కాని విద్యాపరీక్షణపుపరిపాటిమాత్రము ననుభోటులకు హృదయావర్జకముగా లేకున్నది. అనఁగా నిసుమంతపసిమి చేకూర్పవలసినట్టి దని నాభావము.

కథానాయికకుఁగల నాయకానురక్తిని దిద్ది తీర్చుటలో చండభానుని పాత్రము ఒక్కింతసాధనసామగ్రి నెక్కుడుగాఁ గూర్చి రసపోషణకు సాహాయ్యమొనరించినను ప్రతినాయకపాత్రమునందలి ప్రకృష్టతను అది ప్రతీపమార్గమునైనను సరియే యుత్తేజింపఁజేయుటకు చాలియున్నదా? లేదా? అని సందియము. కాని ముఖ్య

కథాంశమునకు మఱొక్కతీరున నందమును చందమును గూర్చు టలో నిది చాలచక్కఁగనే పనిచేసినది.

ప్రాచీననాటకలక్షణములును బీజము బిందువు మున్నగు నాట్యసంధులును ఇందు చక్కఁగాఁ బోషింపఁబడి లక్షణయుతముగా నుంటయే గాక వాగ్వైచిత్రి రసపోషణము పాత్రౌచితి మున్నగు నవీనాంశములలోఁ గూడ నిది నిండియున్నది. కృతి రంగస్థలమున ప్రదర్శించుటకు అతివిపులముగాకయును అత్యల్పముగాకయును సముచితములగు పద్ధతులతోను రంగస్థలముల సన్నివేశముతోను అంకములయు నంకాంకములయు రచనలతోను నిర్దుష్టముగా నిది యలరారుచున్నది.

చెవి కింపుగను సముచితముగను ప్రకృతాప్రకృతవిషయము లువ్వెత్తుగా వెల్లడియగునట్లును ఈకవి అచ్చటచ్చట వాగ్వైచిత్రి నిఁ బ్రదర్శించుచుండును. ఈక్రిందిసందర్భములఁ జిత్తగింపుఁడు.

(౧) మేటిజేంద్లెల్లరుతల్లడిల్లరొకొయెవ్వరుమీాసములుండువారు
(౨) ఈయిందిరయిందిందిరమైసందుసందులదూరిచూచుచున్నది.
(3) అవిచిత్రములు ! (నిజముగాచిత్రములే !)
(౪) భూదారులమనోరథంబులనుజడదారులాయీాడేర్చుట
(౫) నీకు నీహారమొసంగుదునా? ఏదీఏదీ నీహారము—
(౬) నీకహితుఁడు నాకహితుఁడు.

ఇందలి మనోహారములగు విఱుపులు సరసులకు హృదయముఁ బల్లవింపఁజేయుమెఱుపులు కావా?

ఇఁక నర్థాలంకారములును అతిస్పష్టికాని అసంస్పష్టిగాని కానిరీతిని చదువరులహృదయములకు హత్తించుపట్టులు నొకకొన్ని యిందుఁ గలవు.

౧. గీ. కలువ కనుమూయఁదారకల్ కాంతిఁబాయ
ఖగకులమ్ములు గూయఁ జీకటులు మాయఁ
బద్మినీకాంత మదిలోన వంతఁబాయఁ
బొడమె నల్లదెచూడు! మంభోజహితుఁడు.

౨. చ. తరుణిముఖంబు చందురుఁడుదవ్వులనుండియుఁజూచిచూచిదు
ర్భరమగు నీర్ష్య దోప నిజభవ్యకళావళిఁ బెంచిపెంచి మె
క్కురణిని నీడురామిని వగంగొని తా బడుగయ్యెఁగానిచోఁ
బరఁగఁగ నేటి కంతటి ప్రభానిధికిం దిగదీత యాగతిన్.

౩. ఉ. కంతుఁడు రూపమందునుడు కాంతుఁడురంజనయందు భోగభృ
త్కాంతుఁడుసూక్తియందుసుర కాంతుఁడుభోగములందుఁబద్మినీ
కాంతుఁడు తేజమందురఘు కాంతుఁడు శౌర్యమునందు శ్రీసతీ
కాంతుఁడు రక్షయందు మహిఁగాంతుమె యాతనిఁ బోలు
[భూపులన్.

౪. ఉ. అంచితమైనవర్షసమయమ్ముఁగతించె హిమాంశుఁ డున్నతిన్
గాంచెఁ బటీరశైలపవనమ్ములు వీఁచె మిళిందఝాంకృతుల్
మించె ఘటించెఁ జాపమున మీనపతాకుఁడు సాయకమ్ము నీ
పంచమహాగ్నికీలలకుఁ బాలయి యింక మనంగవచ్చునే?

౫. గీ. క్రమ్ముకొనుచున్న కారుచీకటులలోన
నడఁగ సంసిద్ధుఁడయ్యె శీతాంశుఁడిపుడు

కాలగతి నొక్కొకప్పుడు ఘనులు సయిత
మడఁగిపోవుట సాజంబ యగునుగాదె?

ప్రబంధకవుల రచనముల ననుకరించిన ఘట్టములును గలవు. ఉదాహరణార్థ మీక్రిందివి చవిఁజూడుడు.

౧. సీ. కారుమబ్బులమేటిగరువంపుకాంతులఁ
గ్రిక్కించుచున్నది గాత్రశోభ
నిర్మలద్యుతి గ్రక్కు నీహారకరరేఖ
నదలించుచున్నది రదనయుగము
తరుణవయఃప్రభాస్వరకాలఫణిరాజుఁ
దరుముచున్నది పరిస్ఫురితకరము
శ్యామార్జునస్తంభ సంభారమునులీలఁ
బడఁగూల్చుచున్నది పాదభరము
గీ. రంగదుత్తుంగభూమి భృద్రాజములను
కొట్టికోరాడుచున్నది కుంభయుగము
ఇట్టి యుద్దండగతినొప్పు నీ గజేంద్ర
మభినవోత్సాహ మొదవించె నౌర యిపుడు.

౨. గీ. పుష్పవతియైనలతికను ముట్టి పిదప
అమలజలమున నవగాహ మాచరించి
మఱల తాఁకునో యనుశంక మారుతుండు
మందమందమ్ముగా నిట మసలఁజొచ్చె.

౩. సీ. మేలమాడగఁబోలు ఫాలలోచనికంటి
కగ్గంబుగాని సూనాస్త్రితోడ
వియ్యమందఁగనేర్చు ! వీరభద్రునికోప

వహ్నిఁ గందని నిశాభర్తతోడఁ
కలహింపఁగాఁ జాలుఁ ! గలశోద్భవుని ధాటి
కణఁగారకుండు వింధ్యాద్రితోడ
నవఘళింపఁ గఁ జాలు ! సర్కాన్వయుని మేటి
ములికి కడలని సముద్రుతోడ

గీ. మూర్తియందును సత్కళాస్ఫూర్తియందు
ధైర్యమందును విపులగాంభీర్యమందు
నఖిలవిశ్వంభరాభర్తనైకదక్షుఁ
డీ యుదయనభూపాలకుం డెవతెసామ్మి?

వెదుకఁ దివిరినచో నిట్టి రత్నము లిందెన్నియేని కలవు. చక్కని శయ్యయును శయ్యోచితములగు సౌకుమార్యసారళ్యాదులును వాని కిని వన్నెఁ గూర్చు లపితలపితములగు పదార్థసందర్భములును వీనికి అందము నొనఁగూర్చు పాత్రసంపోషణాదికములును గల్గి పఠన యోగ్యమును భావనాయోగ్యమును ప్రదర్శనార్హతను గడించు కొని ఈకృతి యొప్పుచున్నది. గ్రంథకర్త యువకులును అభివృద్ధికి రాఁదగినవారును గనుక ఇట్టివారి యత్నములకు చేతనైనంత చేయూఁత నిచ్చుటయే అస్మదాదులకవశ్యకర్తవ్యమగుటచేత పరేశ్వరుఁడీకవికి దీర్ఘాయురోభగభాగ్యములనొసంగి ఇతోధికమగు సారస్వతసేవసల్పుటకై యదనుఁ గల్పించియనుగ్రహించుటకై కోరుచు నేతద్రచనములఁ జవిగొన్ననాల్కతో నీపాటి లేశముగా కృతిప్రశంస నొనర్చితిని. ఇంకను గల్గు గుణదోషపరిజ్ఞానమునకు సహృదయ హృదయములే పరమప్రమాణములుకదా!

ప్రజోత్పత్తి
పుష్య బ ౫ గురువారము.
మకాం.—నరసాపురం.

విధేయుఁడు,
పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

# అభిప్రాయము.



శిష్టా వేంకటసుబ్బయ్యగారితో నాకు కొన్ని సంవత్సరముల
నుండియు వాఙ్మయవిషయమున సాహచర్యము గల్గియున్నది. కా
వ్యరచనవిషయమున నీతనికిగల యసాధారణప్రతిభను గుర్తించి
ప్రోత్సహించినవారిలో నే నొకఁడను. సహజసిద్ధమై యలవడిన కవి
తాబీజము నీతఁడు శక్తివంచనలేక దోహదము చేయుచు నుత్త
రోత్తరాభివృద్ధి నందించుకొనుచున్నాఁడు. కొన్ని శ్లాఘ్యములగు
వచనప్రబంధముల రచించి యిప్పుడు వాసవదత్తయను నాటకమొ
కటి ప్రచురింపనున్నాఁడు. దాని నామూలచూడము నాకుఁ జదివి
వినిపించినాఁడు. గ్రంథము హృదయంగమముగనుండి యెల్లభంగుల
శ్లాఘ్యముగా నున్నదని చెప్పఁగియున్నది. రెండుపుటలకుమించని
చిన్నకథను కీర్తిశేషులయిన లక్ష్మణరావుగారి హిందూదేశకథాసం
గ్రహమునుండి గ్రహించి నిజభావనాశక్తిచే సందర్భముల గల్పించి
విపులీకరించి మనోహరమగు కథావిధానమును గల్పించి రసపుష్టియు
పదలాలిత్యమును ధారాశుద్ధియు నుప్పతిలు గద్యపద్యములతో.
నలంకరించి ఎలప్రాయముననే ఏడంకముల నాటకము నుదాత్తభం
గిని రచించి భావికవితాకీర్తిసౌధమునకు సోపానమును నిర్మించికొ
న్నాఁడు. సహృదయులగు పాఠకలోకమున కీనాటకము సర్వవిధ
ముల శ్లాఘ్యముగానున్నదని తోచకమానదు. ఇట్టి గ్రంథకర్త
కితోధిక కావ్యరచనాపటిమ నాశంసించు శ్రేయోభిలాషి

NARSAPUR,
22—12—31.

**CHENNAPRAGADA BHANUMURTY**
**B. A. L. T.**
Translator to Government,
( Retired. )

# అభిప్రాయము

సుప్రసిద్ధ పురాతనగాథ ననుసరించి నరసాపుర గ్రామవాస్తవ్యులు మ॥రా॥శ్రీ శిష్టా వేంకటసుబ్బయ్యగారు తాము రచించిన వాసవదత్త యను తెలుఁగు నాటకపు వ్రాఁతప్రతిలోని పద్యములు తత్తత్సందర్భాంశములతో సత్యాదరమున స్వయముగా నాకుఁ జదివి వినిపించినారు.

వీరి నాటకము నేను విన్నంతవఱకు మృదుమధురపదసంకలితమయి సమయోచిత స్వభావవర్ణనములు గలిగి కల్పనాచమత్కృతులతో, రసవంతముగాను నిర్దుష్టముగా నున్నదని చెప్పఁగలిగినందుల కానందించుచు నేతన్నాటకము శీఘ్రకాలము ముద్రితమయి సకలరసికజనహృదయానందకరముగాఁ గలదని భావించుచున్నాను.

RAJAHMUNDRY,
5 -- 12 -- 1931

**VADDADI SUBBARAYUDU,**
Telugu Pandit ( Retired )
Arts College.
RAJAHMUNDRY.

# విజ్ఞాపన.



ఆర్యులారా!

కొండొకయవసరంబున మ॥ రా॥ శ్రీ॥ కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారి హిందూదేశకథాసంగ్రహమును చదువుచుండ జగద్విదితమనోహరకథాకల్లోలినీకల్లోలముల కాకరమైన వత్సరాజవాసవదత్తల గాథ నన్నెంతయు నాకర్షించి రూపకరూపంబున వెలువరింపఁ బ్రోత్సహించినది. కథాసరిత్సాగరాదిగ్రంథంబులందు వత్సరాజు గాథలు విరివిగా వర్ణింపఁబడి యున్నను నిందలి గాథ బిల్హణీయకథావిధానమున కేతద్దేశమున సాదృశమై చారిత్రకమై యొప్పుచుండుటచే కేవలమా కథనే యితివృత్తముగా నెత్తుకొని కథాంగసౌష్ఠవనిర్మాణమునకు నాయుమార్పులను కొలఁదిగా నచ్చటచ్చటఁ గావించి నాటకస్వరూపమునకుఁ గడంగినాఁడను. ఏతచ్చారిత్రకకథాసంగ్రహము గూడ నిందుఁ బొందుపఱచితిని.

ఈనాటకము సత్యాదరముతో విని యుపోద్ఘాతాభిప్రాయము లొసంగిన విద్వద్రాజశిఖామణులకు కృతజ్ఞతాభివందనశతంబు లర్పించుచు నాకొలంది నాంధ్రభాషామతల్లికి దీనినిఁ బారితోషికముగా నొసంగుచున్నాను.

బుధజనవిధేయుఁడు,

శిష్ట్లా వేంకటసుబ్బయ్య

# కథాసంగ్రహము.



అవంతిరాజగు ప్రద్యోతనుఁడు తనకంటె నధికు లెవ్వరైన నున్నారా యనియడుగఁగాఁ గౌశాంబీరాజగు నుదయనుఁడు వైభవమునందు మీకంటె నధికుఁడని యొద్దనుండువారు చెప్పిరి. అందుపై నాతనిని గెలువవలయునని ప్రద్యోతునికిఁ గోర్కెపుట్టె. కాని బహిరంగముగా యుద్ధముచేసినయడల నుదయనుఁడు తనకు వశుఁడు గాఁడని తలఁచి యొకమోసము పన్నెను. కఱ్ఱతో మాయాగజమునుఁ జేయించి యందు శస్త్రధరులగు భటులను ఉంచి యడ్డాని నరణ్యంబుల నిలిపెను. ఏనుఁగులను వేఁటాడు వ్యసనముగల యుదయనుఁ డొంటిగా నాయేనుఁగును వేఁటాడ వెళ్లినప్పుడు లోనిభటులాతనిఁ జెఱఁబెట్టిరి. ఉదయనుఁడు గజహృదయమను శాస్త్రమును నేర్చినవాఁడు గాన నాశాస్త్రము తనకుఁ జెప్పిన నిన్ను వదలివేయుదునని ప్రద్యోతుఁ డుదయనునికిఁ జెప్పెను. ఆచార్యులకుఁ జేయు విధిప్రకారము వందనము లాచరించి శిష్యత్వముఁ జేసిన నేర్పెదనని యుదయనుఁడు బదులుచెప్పెను. వందనమాచరించుటకుఁ బజ్జోతుఁడు సమ్మతింపఁడయ్యె. కాని యాతఁ డావిద్యను నేర్చుకొనుటకై తన కొమార్తెను నేమించెను. ఆమె గూనుగల యొకక్షుద్రస్త్రీయని యుదయనునికిని, ఉదయనుఁడు మరుగుజ్జువాఁడని యామెకును జెప్పి తెరవెనుకనుండి యామె వందనముచేసి విద్య నభ్యసించునట్టు లేర్పాటుచేసెను. కాని యామె తిన్నగా నభ్యసింపనందున నొక

నాఁడు కోపమువచ్చి గురువులవారు "గూనిషోరీ" యని సంబోధించిరి. "అస్లేల యనియెదవు మరుగుజ్జువాఁడా" యని యూమె మారుపలికెను. అందుపై నిద్దఱకును పజ్జోతరాజు చేసిన మోసము తెలిసి వారొకరినొకరు చూచుకొని పరస్పరానురాగబద్ధులైరి. అచ్చటనుండి వెడలుటకొక యుక్తిపన్నిరి. పెద్దయేనుఁగుపై నెక్కి రాత్రి యొకానొక మూలికఁ గోసినఁగాని విద్య ఫలింపదని చెప్పి యూమె తన తండ్రియొక్క భద్రగజమును తీసుకొనిపోయెను. బంగారు నాణెములసంచులు కొన్ని తీసుకొని యూమెయు నుదయనుఁడును గజముపై నెక్కి కౌశాంబికి బయలుదేరిరి. కొంతసేపటికి నీ మోసము తెలిసికొని పజ్జోతుఁడు వారినిఁ బట్టుకొని వచ్చుటకుఁ గొందఱను బంపెను. కాని యుదయనుఁడు వెంటఁ దీసుకొనిన సంచులలో నొక్క-సంచిలోని మాడలవారియెదుట వెదచల్లెను. వారవి యేరుకొనుచుండఁగా దంపతులు ముందటికి దాఁటిరి. భటులు మూడలేరుకొని వెంబడింపఁగా మరల నొకసంచి పాలువైచిరి. ఇట్లు వారు కౌశాంబికిఁజేరి యూపె యుదయనునకుఁ బట్టమహిషియయ్యె. ఆమె పేరు వాసవదత్త.

(హిందూదేశ కథాసంగ్రహము ౯౯ పుట)

---

శ్రీ

# వాసవదత్త



## నాటకము.

- ♦ -

శ్రీతరుణీముఖ స్వమహిషీ నివహాస్య మహోత్పలంపుఁబ్ర
ద్యోతనుఁ డౌచు భక్తిసుగుణోజ్జ్వలవాసవదత్త సత్ప్రశ
స్త్యాతతవైభవుండగుచు రాజిలుశౌరి యజస్రము౯ మిము౯
భూతి యొసంగఁ దా నుదయనుం బరిపోషణ సేయుఁ గావుత౯.

## ప్ర స్తా వ న.

సూత్రధారుఁడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి) ఆహా! రజనీనాథుఁడు నిజచంద్రికా ప్రసారంబున దిక్కాంతల రంజింపఁజేయు తెఱంగున నీ రంగస్థలంబు జనాంతరంగంబుల రంజింపఁజేయుచున్నది. ఈ పరిషత్తు నెట్లు సంతోషపఱుపవలయునో మత్ప్రియసితో నాలోచించెదనుగాక. ప్రేయసీ! ప్రేయసీ!

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! నే నెల్లప్పుడును భవదాజ్ఞానువర్తినాసక్తురాలనే కదా! కరణీయమేమో యెఱింగింపఁ బ్రార్థించుచున్నదాన.

సూత్ర—ప్రియా! సకల కళాంచితులును పరమభాగవతోత్తములును నిరంతర శివపూజా ధురంధరులును నిత్యసత్యవ్రతులునగు పండితోత్తంసులచేతను లలితకవితారసాస్వాదనులగు కవిసార్వభౌములచేతను ప్రకాశించు నీ సభ నవలోకింపుము. ఇట్టి సభ నేవిధంబున రంజింపఁజేయఁగల్గుదుమో యోజింపుము.

నటి—(యోజించి) ఆర్యా! వాసవదత్త నిజముగా వాసవదత్తయే కదా! అట్టి యామె చరితము రూపకముగాఁ బ్రదర్శించి నచోఁ ప్రేక్షకుల నానందింపఁజేయఁ గల్గుదుమని తోఁచుచున్నది.

సూత్ర—ఔను. బాగుగా జ్ఞప్తికిఁ దెచ్చితివి. ఏతద్రూపక రచయి
తయు మిక్కిలి నిపుణుఁడని వినికి.

నటి—అట్లయినఁ దన్నామధేయంబు వినఁగోరుచున్నాను.

సూత్రి-

గీ. ప్రథిత శిష్టాకులాబ్ధి నైరవవిభుండు
సరస సూర్యనారాయణశాస్త్రి సుతుఁడు
శ్రీ జగన్నాథశాస్త్రికి శిష్యవరుఁడు
సుబ్బయాఖ్యుండు కర్త యీ కబ్బమునకు.

ప్రేయసీ! నీ మృదుమధురగానంబుచే నొక్కసారి నా వీనుల త్రుప్పు
డుల్లింపుము.

నటి—గేయ మెయ్యదియో యనుజ్ఞ నిచ్చెదరా!

సూత్ర—కలికీ! ఎల్ల వస్తువులకును గుణ మతిశయింపఁజేసి చెలువు
ఘటించునట్టి ఋతురాజమునుగూర్చియే గానము సేయుము.

నటి—ఆర్యా! ఈ వసంతకాలము సాంతముగా నెవ్వరు గాన
మొనర్పఁగలరు?

ఉ. చూతమహీరుహమ్ములను శోభిలు లేఁజిగురాకు భుక్తిచే
నాతతమోదభారమున సంతకుసంతకుఁ బొంగి కోకిల
వ్రాతము గూయుచుండ నసురాగమునన్ యువకుల్ వె
నూతనచైత్రవిభ్రమ మనూనసుఖప్రదమయ్యె ధాత్రికిన్.

సూత్ర—ప్రేయసీ! కడు మనోహరంబుగా గానమొనరించితివి. ఇట్టి
వేళలందు

గీ. లలిత వాసంతలక్ష్మీ విలాసశాలి
పంచసాయక వసుమతీ వల్లభుండు
ప్రవిమలోద్యానస్థాంతరాళసీమ
నిండు పేరోలగంబుండు నీరజాక్షి !

నటి—ఆర్యపుత్రా ! వసుమతీవల్లభుఁడు నిండు పేరోలగము— అనునిది ప్రద్యోతనుని సభ యిప్పుడు జరుగనున్నదని జ్ఞప్తి సేయుచున్నది. కావున సత్వర మేఁగి యుచితభూమికాధారణ మొనర్తము రమ్ము. (నిష్క్రమించును)

సూత్ర—(నిష్క్రమించును)



శ్రీ

# వాసవదత్త

## ప్రథమాంకము.



[ సింహాసనాధిష్ఠుఁడగు ప్రద్యోతనుని ప్రభాకర భాస్వంత భైర
వులు పరివేష్టించి యుందురు. ]

ప్రద్యోతనుఁడు—మంత్రిపుంగవా! మీసాయమున నాపటెలం
గనియరివీరుల నణుమాడి యెల్లెడల శాంతి నెలకొల్పఁగలి
తిమి. ఇంకను మనకన్న నధికులగు రాజు లెందైనఁ గలరా!

ప్రభాకరుఁడు—

ఉ. పెల్లగు సత్వసంపదకు వీడగు బాహుబలంబు జలించు నే
బల్లిదమైన కార్ముకపుఁబాండితి పైఁగలేక మేటి శ్రే
ణ్లెల్లయుఁ దల్లడిల్లరొకో? యెవ్వరు మీ సములుండువారు నీ
యెల్లజగంబునందు నిఁక నేటికి వేయును వీరపుంగవా!

భాస్వంతుఁడు—భూపాలా! మీరు శక్రు నతిక్రమించు పరాక్రమో
పేతులు. రూపమందు జయంత వసంత సన్నిభులు. దాన

మందుదధీచి శిబి కర్ణ ప్రముఖాది సమానులు. అట్టి మీ
పరాక్రమంబునకు గూడ దాన విభవంబులకు నచ్చెరువొం
దనివారలెవరు? రాజా!

కం. గండుమెకమగు బెబ్బులికిని
తుండాలము కేసరికిని స్రుక్కినయట్లన్
భండనమహిం నీ విక్రమ
చండతకును స్రుక్కకున్నె శత్రుగణంబుల్.

ప్రభా—మీ సుగుణగణవిభూషితానంబును మీ శౌర్యోన్నతియు నెం
తని కీర్తింపఁగలము?

సీ. ఎవ్వాని కరఘాతుకోద్భూత రిపువీర
జనులకు స్వాత్మ్య దేవతలు గాఁగ
ఎవ్వాని తురగంబు లరిదీపికలకెల్ల
ఘనకీలికాస్ఫులింగములు గాఁగ
ఎవ్వాని ఘనయోధబృందంబు శాత్రవో
త్తములకుఁ బిడుగు మొత్తములు గాఁగ
ఎవ్వాని శరశరావళీనకృపాణంబు
పరిపంథులకుఁ బ్రాఁచుఁబాము గాఁగ
గీ. వఱలుచుండునొ యట్టి విశ్వప్రసిద్ధ
చండప్రద్యోతబిరుదాభిమండితుఁడవు
శీలవైభవముల నిన్నుఁ బోలఁ గలరె?
అన్యభూపతు లెవ్వరే నరసి చూడ.

ప్రద్యో—ప్రభాకరా! మదీయామాత్యశేఖరుండవైన కతన నీవు నన్నీ వన్నియఁ గొనియాడుచున్నావు. మైత్రియం దిచ్ఛకం బుండుట సహజంబు గదా! మదీయ బాహుశక్తి చేతను త్వదీయాలోచనాపరంపరలచేతను రాజమండలము సవలీల జయించితి. యశఃకాంతుల నాశాంతంబుల విరాజిల్లఁ జేసితి. కాని నాకన్నఁ బరాక్రమంబున మిన్నలై యున్నవాఁడు రాజు లింకనుం గలరని నా డెందంబు సందియంబు నొంది యున్నది. నీ యహితవాక్యంబులకు నే నలిగి మనంబునఁ గినుక వహింతునని సందేహించెదవేమో? నీ కొఱంతయు నా శంక వలదు. పరాక్రమవంతమగు రాజమండలంబు సవలీల జయించుట కెక్కుడుకారణభూతమైనది నీ బుద్ధికౌశలతయు నీ చాకచక్యప్రభావంబు గాదె? దిక్తటంబుల వ్యాపించు మన యశఃకాంతుల నడంచు మహీకాంతు లుండురేని వారిని నిర్జించి మన కీర్తిచంద్రికలు విస్తరించు నట్లొనరింతము. అట్టి వసుధాధీశులుండరేని వారిం జేర్కొం టివా మన కత్యంతోపకారంబు.

కం. మిహికాంశుఁడు లేక నిజని
మిహిరుఁడు లేక బయలు గృహమేధియు లే కే
గృహమును రాజులనట్టుల
నెహియించునె? మంత్రి లేని రాజ్యంబెంచన్.

ప్రభా—(యోజించి) రాజా! నీ పరాక్రమవ్యాప్తి ప్రసరింపని

వాసవదత్త.

చ. కలఁ డొక దొడ్డ భూధవుఁడు గాఢభుజాబలసంయుతుండు ప్రో
ద్వేలయశశ్శ్రీనాలీల రిపుభీషణుఁడై కనుపట్టువాఁడు త
ద్వేలసితచండశూరతకు వేగమె గుండెలు వ్రీలిపోని భూ
పాలుఁడు నీవుదక్క మఱి ధారుణి లేఁడు తలంప భూవరా.

క్షితీశా! వాని పరాక్రమక్రమం బెట్టిదనిన

సీ. ప్రథితబాహాశక్తి ప్రకటించు తఱియందు
శరజన్ముఁడైనను సాటి రాఁడు
సమరకళాప్రదర్శన మొనర్చెడువేళ
సవ్యసాచియు నేని సాటి రాఁడు
ప్రబలప్రతాపంబు ప్రకటించు పట్టున
జానకీధవుఁడైన సాటి రాఁడు
విపులధీరత్వంబు వెలయించునప్పుడు
జాంబూనదాద్రియు సాటి రాదు

గీ. ప్రవిమలగుణగణస్ఫూర్తి! భవ్యకీర్తి!
రణవిజయమూర్తి! అంచిత రమ్యమూర్తి!
శస్త్రమార్గానువర్తి! విద్యాప్రవర్తి!
వారకౌశాంబికాపురీ చక్రవర్తి!

కం. ఉదయనుఁడు పరంతపసుతుఁ
డుదితయశోధనుఁడు సుగుణుఁ డూర్జితతేజుం
డు దయావితరణభరితుఁడు
సదయాత్మతఁ బోలు రాజసత్తము నిన్నున్.

భాస్వం.—మన మంత్రిపుంగవుఁడు వచించిన తెఱంగున నుదయ
నుఁడు వైభవంబున మిన్న యని జను లెన్నుకొను చుండిరి.
వానిని జయించినచో భవద్యశశ్శాఖలు దిగంతంబుల
వ్యాపించును.

భైరవుఁడు.—దేవా! ఉదయనుఁడు సకలరణరంగవిద్యా పారంగ
తుఁడు. వెండియు గజశాస్త్రమున నాతఁడు వినుతి కెక్కె.
ఆతని కరిబృందంబులవలననే యాతఁ డాజిలో విజయంబు
నొందుచున్నాఁడు.

మ. గజయూథంబులఁ బట్టుటో సరళతన్ గాపుంచుటో కోటకున్
విజనంబైన వనంబులో నిభములన్ వేఁటాడఁగా నేగుటో
గజశాస్త్రంబు పఠించుటో కవులతో గాథల్ ప్రశంసించుటో
ధ్వజినీవ్రాతము గూర్చుటో యతనికిన్ వ్యాసంగమైయొప్పెడున్.

ప్రద్యో.—ప్రభాకర భైరవ భాస్వంతులారా! ఉదయనుఁడు గజ
శాస్త్రవేత్తయా? అట్లయిన నా మనోరథం బీడేరునా?
అన్నా! ఎన్నిదినములనుండియో గజశాస్త్రం బభ్యసింప
నభిలషించుచుంటి. కాని గజశాస్త్రపారంగతులు లభింపని
కతంబున నూరకుంటి. ఆర్యా! (ఆత్రముతో) ఉదయను
నుండి గజవిద్య యెట్లు సంపాదింతును? (యోజించి) వానిని
ఘోరాజి నిర్జించి తెచ్చి యాతని కడనుండి విద్య గ్రహింప
వలెను.

ప్రభా.—దేవరవారికడ వైరిబలంబులఁ బొగడుట ననుబోంట్ల కుచి

తంబు గాదు. రణరంగమున నిల్చి వానితోఁ బోరుట దుర్లభం బనియే చెప్పుదురు.

ప్రద్యో—(కను లెఱ్ఱఁజేసి) ఆ!

గీ. ఆహవమ్మున నతని బాహాబలమ్ము
నడఁచి నా రాజధానికి నచిర మింకఁ
బట్టి బంధించి తేకున్నవాఁడ నేని
ఇమ్మహాశూరబిరుదం బిఁకేల నాకు.

భాస్వం—దేవా! మనము పరాక్రమవైభవోపేతులమును సకల రణవిద్యాకౌశలప్రదర్శనసముంచితసేనాసమగ్రులమును నగుదుమే కాక

గీ. శుండిశాస్త్రపారంగతశూరుఁ డతఁడు
ప్రకటమతికౌశలమున వాక్పతి యతండు
వాని ఘోరాజి నిర్జింప వసుమతీశ!
హరు వశమె కాని కేవల నరుని వశమె?

ప్రద్యో—(నేత్రంబు లరుణంబులు కాఁగ) ఆ పేరు నింతగా విన్నంతమాత్రమున మానసాబ్ధినిఁ గ్రోధబడబానలంబు ప్రజ్వరిల్లుచున్నది. మదీయ హస్త కలితంబగు కృపాణంబు తనంతటఁ దాన విజృంభించుచున్నది. ఆహవంబున వాని నిర్జించి మనకు వశవర్తునిగాఁ జేసికొని యా గజశాస్త్రం బభ్యసించి తీరవలయు. వానిం బట్టి తెచ్చునంతవఱకు నా మనంబున కూఱట గలుగదు. ప్రభాకరా! నా మనోరథరథంబునకు నీ

మాయోపాయ హయంబులనుబూన్చి గమ్యస్థానంబుఁ జేర్పుము.

భైర—రాజాగ్రణీ! అన్నిఁటికిని మన మంత్రిపుంగవుఁడే కలఁడు.

ప్రభా—ఉదయనునిఁ గదనతలంబునఁ బరాక్రమశతంబుచే జయిం చు టసాధ్యంబు గావున మాయోపాయంబుచే వానిని జయింపఁగలమని తోఁచుచున్నది.

గీ. ఎన్ని కనుగన్న వేఁటరి పన్నినట్టి
వల నదెంతజంతువయినఁ బడెనుగాని
చెలఁగి మన మొద్దు పెనుమాయ వలను దవిలి
చిక్కుకొండునే యుదయనసింహ మధిప!

ప్రద్యో—ప్రభాకర భాస్వంతులారా! యయ్యది రాజనపాడియా? వైరుల రణరంగముననే నిర్జింపవలయును. మాయోపాయం బునన్ని జయించుట ధర్మవిరుద్ధంబుగదా!

ప్రభా—శాత్రవులను మాయోపాయంబున జయించుట ధర్మవిరు ద్ధంబనియా మీ సందియము. మున్న ధర్మరాజాదు లట్లొ నర్పలేదే? రిపునృపులను మాయోపాయంబున జయించుట ధర్మవిరుద్ధంబుకాదు.

ప్రద్యో—(యోజించి, తలపంకించి) ప్రభాకరా! మాయోపాయం బుచేతనైన నాతఁడు పట్టువడునని నీ వెట్లు నిశ్చయింపఁ గలవు? అట్టి మాయోపాయ మెద్ది?

ప్రభా—భూపాలా! ఉదయనుఁడు మృగయాసక్తుఁడు. ఆతఁ డను

దినంబున వింధ్యారణ్యప్రాంతములకు వేఁటాడఁ బోవుచుండును. చూచువరికి నిక్కంబని తోఁచునట్లొక్క దారుమయ గజంబును నిర్మించి యద్దాని గర్భంబున శూరసైనికులను దాఁచి తత్ప్రదేశంబున నుంచి యుదయనుఁడు వేఁటాడ వచ్చునప్పు డొంటిపాటున వానినిఁ బట్టి బంధించునట్లు భటుల నియమింతము. అంత నాతఁడు మనకు వశుఁడు కాఁగలఁడు.

ప్రద్యో—(తలపంకించి, నిట్టూర్పువిడిచి) మంత్రిశేఖరా! నీ యుపాయంబు లప్రతిహతంబులు. కడు నేర్పరులగు తక్షుల రావించి నీ యిష్టానుసారము ప్రవర్తింపుము.

(తెరలో వైతాళికులు) ఆహా!

గీ. క్రమ్ముకొనుచున్న కారుచీకటులలోన
నడఁగ సంసిద్ధుఁడయ్యె శీతాంశుఁ డిపుడు
కాలగతి నొక్కొకప్పుడు ఘనులు సయిత
మడఁగిపోవుట సాజంబ యగును గాదె?

భైర—అబ్బా! ఎంత ప్రొద్దుపోయినది.

ప్రద్యో—కార్యాలోచనభారంబునఁ బ్రొద్దెఱుంగకున్నారము.

ప్రభా—రాజా! సత్కర్మానుష్ఠానసమయమును నయ్యెఁగదా!

(అందఱు నిష్క్రమింతురు.)



శ్రీ

# వాసవదత్త

## ద్వితీయాంకము.



ప్రదేశము — వింధ్యారణ్యము.

[ అంత విజయుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

ఆహా !

ఉ. దిక్కులఁ బిక్కటిల్లఁ జెలఁగి పక్షి సమూహము ఘోషపెట్టఁ జెం
పెక్కె శకుంతకూజితము తెల్లెడఁ బాటలకాంతితోడఁ బ్రాగ్
దిక్కునఁ దోఁచె సూర్యుఁడు తీరుగ వీచెను పిల్లతెమ్మెరల్
పక్కున విచ్చె నూత్నశతపత్రగణంబు ముఖంబు మీఱఁగన్.

(ఆలస్యము నభినయించి) ఎంత తడవైనది! నేఁడు పెందలకడ వేఁటాడ నియ్యరణ్యసీమలకు సంసిద్ధుఁడవు కమ్మని తేనియాజ్ఞ. హౌరా! వేఁటయం దాసక్తి దినదినప్రవర్ధమానమగుచున్నది. వేఁటవలనఁ జేటని కదా పెద్దలు చెప్పుదురు. నే నీవఱ కెన్నిసారులు బోధించినను వినియు విననట్లూరకున్న తేనికి నేటి ప్రసంగములయందు

వెనుకటికన్న మిన్నగాఁ గందువమాటల వచించి వేఁటవలని జేటులు మనంబునకు నాటునటుల వక్కాణించి మరలింపఁ జూచెద. (నలు దిక్కులఁ బరికించును)

(తెరలో) సూతు లెందున్నవారు?

అదిగో! ఉదయనభూపాలుఁడిందే వచ్చునట్టు లున్నది.

[ ఉదయనుఁడు ప్రవేశించును ]

ఉదయనుఁడు—సూతు లెందున్నవారు? (పరికించి) పూజ్యులగు నాప్యులిందే వేఁచియుంటిరా?

విజ—చిత్తము. దేవర యాజ్ఞ సర్వము సిద్ధము. నిశాకరము రాకా శశాంకుని రాకకు వోలె.

ఉద—(మందహాసముతో) మంచిది.

విజ—(నలుకెలంకులఁ బరికించి) ఆర్యా! చూచితిరా? ఈ వింధ్యా రణ్యప్రాంతము లెంత భయంకరములు! (చూపుట నభిన యించుచు) ఈ వంక విలోకించిన ఘోరసత్వభయంకరంబు లగు నికుంజంబులు! ఈ దెస వీక్షించినఁ గోరమీసలు నోర చూపులును గల్గి యెట్టి యోద్ధకైన భీతి గల్గించు మృగేం ద్రగర్జనంబులు. ఈ వైపు తిలకించిన కర్ణపుటభేదకంబులగు కిటిచయంబుల ఘుర్ఘురధ్వనులు ...

ఉద—(దూరము పరికించుచు) విజయా! ఈ విపినంబు భయాన కంబ. అయ్యును ప్రకృతిశోభలకును నాకరంబేసుమా! అదె! అదె! ఆ దెసఁ జూడుము.

సీ. పరభృతమిథునముల్ పల్లవగ్రాసము
లొండొంటికింపుగా నొసఁగు హాయలు
బంభరమ్ములజంట పంకేరుహపుటింట
మకరందములఁ గ్రోలి మలయు శోభ
దాడిమీబీజాళి దళియించి చిల్కలు
నింపుమీఱఁగ నారగింపు సొబఁగు
కలహంసదంపతుల్ కమనీయ గతులతో
నీరవిహారంబు నెఱపు ఠీవి
గీ. మానిత పనస రంభాసమన్వితంబు
ఫల కుసుమగుచ్ఛ వనలతా విలసితంబు
భవ్యతరనవ్యమాలికా భాసురంబు
గణనసేయంగఁ దరమె యీ కాననంబు.

విజ—ఔను! ఇవన్నియు వనలక్ష్మికిఁ బెట్టనిసొమ్ములు గదా! చూడఁజూడ నాకును నానందంబు గలిగించుచుఁ బూర్వాం శంబులను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. ఈ సాంద్రారణ్య కఠినో పలప్రదేశంబులయందుఁ బల్లవసుకుమారశరీరులును హంస తూలికాతల్పశయానులునగు రఘుకులోత్తంసు లెట్లు వాసం బు సల్పిరో? ఎట్టివారికి నిక్కట్టులు దప్పవుగదా!

ఉద—ఆర్యా!

గీ. దీనులైనను భూతలాధీశులైన
మందులైనను లోకనిర్మాతలైనఁ

పూర్వకర్మానుసారంబు పొందుచుండ్రు
సుఖములును గష్టములు ధాత్రి శుభచరిత్ర!

(తటాలున నొకవంకకుఁ దిరిగి) ఆ! విజయా! చూడు! చూడు! ఆ మృగం బెట్లు పరువెత్తుచున్నదో! దాని నిప్పుడే వేటాడ వలయును.

విజ—(చిరునవ్వు నవ్వి) వేటాడుటకు వలసినంతకాలము గలదు. కాని వేట వ్యసనంబనియు వ్యసనంబు పాపకారణంబని కదా చెప్పఁబడినది.

చ. పరధనసంగ్రహంబు పరభామలయందభిలాష జూదమం
దరయఁగ భూరికాంక్షయును నాసవవాంఛ కఠోరదండనల్
పరుషము లాడ నిచ్చయును వన్యమృగంబుల వేటయుఁ ధరా
వర! వ్యసనంబు లేడు నివి వర్జ్యములౌఁజుమి రాజపాళికిన్.

ఉద—(మందహాసము చేసి) అయ్యయ్యో! నీవెంత పొరపడుచుంటివి. శరీరమునకు ముఖ్యమగు వ్యాయామములలో మృగయా వ్యాయామంబున లోని క్రొవ్వెల్లఁ గరంగి యుదరము కృశించి పిక్కటలు నిమిడియుండు. దేహ ముత్సాహయోగ్యమై యనాయాసంబుగా నెట్టువలసిన నట్టు ద్రిప్పుటకు వలను గలుగు. క్రోధభయమ్ముల కిమ్మయి పాటు సత్త్వసంతతుల చిత్తవృత్తులుఁ బరీక్షింపవచ్చునుగదా! క్షత్రియునకు మిక్కిలి యవసరమగు లక్ష్యవివేకంబు గలుగుటకు వేటదక్క వేఱొండు సాధనము లేదు. అలసులు వేట వ్యసనంబని

వచింతురు గాని వేఁటతో సాటియగు వినోదమ్మేదైన నీ
మేదినీతలమునఁగలదే ? ఎంత వెఱ్ఱి! కిల్బిషాకరమునుకాదు.
ఏలయందువా ? అరణ్యసమీపవాసుల మాన్యక్షేత్రముల
నాశనముసేయు క్రూరమృగముల వధించుట రాజధర్మము
గాదె ? దుర్బలులగు వనవాసు లనేకులు వనంబుల సంచ
రించుచుందురుగదా! ఘాతుకమృగంబుల బారిఁ బడకుండ
వారిని రక్షించుట రాజయినవానికి విధి. తపోధనులకు
సహాయమును ...

విజ—వేఁటయం దాసక్తియే యట్లనిపించును గాఁబోలు.

ఉద—ఎంతమాట! ధర్మానుశాసనము వినలేదా ? "దుర్బలజఘాం
సువులైన ఝషంబులను నీడద్రుమపీడాకరంబులైన నీడజంబు
లను సనవద్యతృణహింసానృశంసంబులగు మృగంబులను
మృగయా వినోదంబుల వధించి మహీధవుండు కిల్బిషంబును
బొందఁడు" అని.

విజ—అదియు నిజమే. అయినను వేఁట పెక్కురకు వ్యసనఫలమునే
యొసంగినది.

సీ. కరిరవంబని యెంచికడ ! మౌనిసుతుఁగ్రుంచి
పలుకష్టముల నొందెఁ బంక్తిరథుఁడు
మును జింకలని యెంచి మునిదంపతుల నేసి
పటుశాపహతుఁడయ్యెఁ బాండువిభుఁడు

శాంతాటవుల వేఁట సాగించి కోల్పోయె
సామ్రాజ్యరమ హరిశ్చంద్రవిభుఁడు
పసిఁడియిఱ్ఱి యటన్న భ్రమనేగి నిజదారఁ
బోఁగొట్టుకొనె రామభూవరుండు
గీ. అరయ భూమీశమండలి హద్దు మీఱి
వేఁటయనుపేరి వ్యసనంపుటేట మునిఁగి
పడదె? యెన్నని పడరానిపాట్లు తొల్లి
యకట! తగునొక్కొ? వేఁట బాధాకరంబు.

ఉద—పిచ్చివాఁడవు. వేఁట శుభదాయకమునుగాదా?

ఉ. ఆ నహుషాత్మజుండు గహనాంతరసీమల వేఁట వోఁడె? బా
ణాసలకీలల న్మృగచయంబును వేల్వఁడె? యాతఁ డంత వా
పీ నిలయంబునందు దురపిల్లెడు కావ్యజ నుద్ధరించి య
మ్మానిని తన్ను వేఁడఁ గడుమక్కువఁ బెండిలి గాఁడె తొల్లిఁటన్.

అదియునుగాక

గీ. సకలనృపచంద్రుఁడైన దుష్యంతునకును
కుటిలకుంతలయైన శకుంతలకును
సరవిఁ గణ్వాశ్రమోపాంత ధరణి యందుఁ
బెండ్లి సమకూర్చినది తొల్లి వేఁట గాదె?

విజ—భూపాలా!......

ఉద—(అసహన మభినయించుచు). అబ్బా! ఆ బెబ్బులి కర్ణపుటం
బులు గడియలు ఎడు చండంబున నెట్లు బొబ్బలిడు చున్నదో

వింటివా! అది యేదే సాధుమృగంబును జంపఁ బోయెడిని. చూడుము! చూడుము! ముద్దు గుల్కు మృగశాబకంబులఁ బరువు లెత్తించుచు గహనమెల్ల నుల్లకల్లోలముఁ గావించుచున్న యా బొబ్బమొకము నిప్పుడే పడఁగూల్చెద. (బాణమును విడుచును.)

విజ—రాజా! చూచితిరా! ఆబొబ్బమొకము మీ బాణఘాతము నకుఁ దాళలేక నేలపై విలవిలఁ గొట్టుకొనుట నెట్లుచూచినదో దానిని దినుటకై యప్పుడే పరువెత్తు శరభంబును.

ఉద—(త్వరతో) సత్వర మియ్యాభీలమృగంబును జూపు మాపి వచ్చెద.

విజ—తమ్మనుసరింప......

ఉద—వలదు! వలదు! నీ విక్కడనే వేఁచియుండుము. సత్వరమ వచ్చెద. [నిష్క్రమించును]

(ఉదయనుఁడు మరల ప్రవేశించి వేఁటతొందర నభినయించుచు)

ఉద—అబ్బా! ఎంతదూరం బది సన్నెలయించుకొని వచ్చినది! ఈ నిశితాస్త్రం బా శరభంబుపైఁ బ్రయోగించెద. (బాణమును విడుచును) (కరుణను రూపించుచు) అన్నన్నా! ఆ మృగం బిపుడు బిట్టడలి విలవిలఁ గొట్టుకొనుచున్నది. (పహ్యాముతో) ఔరా! రాజకృత్య మెంత కఠోరము. (ఉస్సురనుచు) నేటి మృగయావ్యాపారము నా కెంత ఖేదము గలిగించినది. అబ్బా!

గీ. సొమ్మసిలుచున్నదంగమస్తోకగతిని
వఱదలై చెమ్మటలు జాలువాఱఁ జొచ్చె
శ్రమభరంబున గాత్రముల్ జవము నుడిగె
పెంపుగను డప్పిమై నాల్క బెండువాఱె.

కట్టా! ఈప్రదేశంబునం దెచ్చటను జలాశయంబు గానరాకున్న దే! (చెవియొగ్గి) ఏమి? ఎద్దియో మధురధ్వని వినవచ్చుచున్నది. ఇదేమై యుండనోపు! (నిరూపించి) నిక్కముగా నిదికుంజులమగు రాజహంసి శింజితమువలెఁ దోఁచెడిని. కాన నిచ్చట నెద్దియో కాసారం బుం డనోపు. పరికించి చూచెదఁగాక. (తిలకించి) నిక్కముగా సనతి దూరంబునం దొక కాసారంబున్నది. (ఆశ్చర్యముతో) ఆహా! ఆప్రక్క నదియేమి? విరిగిపడిన యంజనాచలశిఖరమోయన నల్లనై కన్పట్టుచున్న దే! (నిరూపించి) అది యొక మదప్రభిన్నకటమగు మత్తమాతంగము.

సీ. కారుమబ్బుల మేటి గరువంపు కాంతులఁ
క్రక్కించుచున్నది గాత్రశోభ
నిస్తులద్యుతి క్రక్కు నీహారకరరేఖ
నదలించుచున్నది రదనయుగము
తరుణవయఃప్రభాస్వరకాలఫణిరాజుఁ
దరుముచున్నది పరిస్ఫురితకరము
శ్యామార్జునస్తంభ సంభారమును లీలఁ
బడఁగూల్చుచున్నది పాదభరము

గీ. రంగదుత్తుంగభూమిభృ ద్రాజములను
కొట్టి కోరాడుచున్నది కుంభయుగము
ఇట్టి యుద్దండగతినొప్పు నీ గజేంద్ర
మభినవోత్సాహమొసవించె నౌర! యిపుడు.

కాసారజలంబు లించుక కోరిలినపిదప ... కాదు! కాదు! పిపాస మాట యటుంచి దీని నెట్లులైన ముందుగాఁ బడఁ గొట్టవలయు. (కొంచెము సమీపింపఁబోయి) ఆహా! ఇట్టి గజరాజమును బట్టి బంధించినవెన్కఁగదా చిత్తవార్ధి యుప్పొంగుట! (మఱి కొంచెము సమీపించి) ఇదియేమి? ఎక్కడను కదలినట్లు కనుపించదే? ఆశ్చ ర్యముగా నున్నది! ఎవరైనను దీనిని బంధించియుందురా? అది యును గానరాదు. నిజమైన యేనుఁగు గాదాయేమి చెప్పుమా! (హసించి) దాని తుండమునకు సహజమగు సంచలనమను మాట యే లేదు. (నడివడిగా సమీపించి) ఔను! ఇది కేవలము కృత్రి మదంతావళము. ఈప్రదేశమం దిట్లుయుండుటకుఁగతంబేమి? విపి నంబులు బలుకంబులగు దారువుల కునికిపట్టుగదా! ఎవ్వఁడో యీవనంబునందుండి తన కళాకౌశలంబు మెఱయ నిర్మించి యుండనోపు!

గీ. విపినసీమలు కొట్టినపిండి నాకు
ఏ నెఱుంగనిమర్మంబు లెందు గలవు
కన్ను చెడకుండఁ గనుపాప కరము వెఱకు
నేర్పు గలిగెనక్కట! యీ యనేకపంబు.

(దానినింకను సమీపించి) బళిరే! సృష్టికిఁ బ్రతిసృష్టి యొనర్చి ప్రకృతిరామణీయకంబు డంబు విడంబించు దారుమయగజంబు నొనర్చిన యీ చతురుఁడెవ్వఁడో కదా! వాని పనివానితన మెంతయు మెచ్చుకొనఁదగినదే! (ముందునకుఁ బోయి) ఆహా! ఈ దంతములేమి? ఈ తుండాగ్ర ... ... ...

[ శూరసైనికు లా గజగర్భంబునందుండి బిలబిల వచ్చి ముగ్ధుఁడైన యుదయనుని బంధించివేయుదురు. ]

[ శృంఖలాబద్ధుఁడగు నుదయనుఁడును సైనికులు ప్రవేశింతురు. ]

ఉదయనుఁడు—ఔరా! కాలము విచిత్రము దుస్తరమును గదా! వంశరాజ్యలక్ష్మీధురంధరుండనగు నాకు కాలమెట్టి విపద్దశ గల్పించినది. (కోపముతో) ఓకుహనాసైనికులారా! కపటోపాయంబు లనేకంబు నన్ని శస్త్రాస్త్రంబులను లాగుకొని బందిపోటుచందంబున దోఁచుకొనునట్టి రాజాధము లుండిననేమి? మండిననేమి? (సైనికులు గొందఱు భయపడి కొలది దూరమున నిల్తురు.) ఏల యిట్లు పిరికిపందలవోలె దూరదూరంబున నిల్చి కారుకూతలు గూయుచుఁ జేరాని చేతలఁ జేయుచుండెదరు? మీరాజునకు మగంటిమి గలదేని ధర్మయుద్ధము సేయ సమర్థుఁడేని నాకరవాలంబునా కొసంగి యుద్ధమునకు సిద్ధమ్ము గమ్మని బుద్ధి సెప్పుడు.

సైనికులు—ఉదయనమహీపాలా! మిమ్ముల నెట్లైనఁ బట్టి బంధించుకొని రమ్మనియే మా ప్రద్యోతనభూపాలు నాజ్ఞ.

ఉద—ఏమి! ప్రద్యోతనుఁడా యీ పిరికిపంద. సరే! వాని సమ్ముఖమ్ము నఁ బడలేక పిరికితనంబున వెఱచుచుఱచువానికిఁగాని నాకీ బం ధనములేల? నేనే వచ్చెదను.

కొందఱు సైనికులు—రాజా! ఇప్పటికే చాల తడవైనది. ఆకలి దప్పులచే మాప్రాణంబు లటమట మగుచున్నవి. సత్వరము నడువుడు.

ఉద—ఔను! రాజాజ్ఞాబద్ధులై వృత్తిదోషంబున నెట్టినీచకృత్యంబు లైనను జేయుచు నెవరొనర్చిన పాపఫలము వారీలోకము నందే యనుభవింపవలెనను మాడ్కి నీ మాయామృగగర్భం బునంబడి నన్నుఁ బట్టుకొంట కెన్నాళ్లనుండి క్షుత్పిపాసాదు లులేక మాడుచున్నారో పాపము. నడువుడు! నడువుడు! నేఁడీ పశుగర్భమునుండి వెలువడి పశువులే యైతిరి. పశువుల కింద్రియనిగ్రహంబు దుర్లభంబుగదా!

( అందఱును నడిచి పోవుచుందురు. )

[ మరల నుదయనుఁడును గొందఱు సైనికులు ప్రవేశింతురు ]

ఉద—ఔరా! ఉదయనభూపా! శుండిశాస్త్రపారంగతప్రదీపా! నీవు గజశాస్త్రవేత్తవా? (నవ్వుకొని) ఔను! అనుభవజ్ఞుల పల్కులూరకపోవునే?

గీ. క్రించుఁదనమున విధియు వక్రించినపుడు
తమకు నేర్పు గలట్టి కార్యములయందె
ఒదవుచుండు నపాయంబు లోకోక్తి కప్పు
డనేడు నార్యోక్తి త్రోసివేయంగనగునె?

ఓ ఉదయనా ! నీ శౌర్యప్రతాపలసచ్ఛక్తు లుడింగెనా ?

శా. నీదోర్దండపటుత్వసంపదయునున్ నీసంగరస్థైర్యమున్
నీదంతావళశాస్త్రకౌశలము నీ నిస్త్రింశధారాలస
ద్వైదగ్ధ్యంబును నీవిరోధిజనదుస్తంత్రచ్ఛిదా ప్రౌఢియున్
బూడింబ్రుంగెనె ? బందివైతివి కటా! పుణ్యంబు పోకారెనే ?

( అందఱును నిష్క్రమింతురు. )

[ విజయుఁడు ప్రవేశించును. ]

విజయుఁడు—ఉదయనభూపాలుఁ డేగి యిప్పటికే చాలతడవయ్యె. అయ్యాభీలమృగంబును గూల్చివత్తునం చరిగి యిందనుక రాకుండె. ఔరా !

మ. పరిశోధించితి నీ నిగూఢవిపినప్రాంతమ్ము లొక్కుమ్మడిన్
దఱచౌకుంజములన్ గుహాంతరములన్ దట్టంబులౌ తావులన్
జొఱఁగారాని నగాంతరస్థలుల సంశోధించితింగాని మా
ధరణీపాలుని జాడగాంచ నకటా! దైవంబు క్రూరంబెకా !

అతఁ డెందును గానరాకున్నవాఁడు. నే నింకెచ్చట వెదకుదును ? ఏమి సేయుదును ? (నిట్టూర్పువిడిచి నిరూపించి) ఇదియేమి ? ఈ దెస నడుగుజాడలు గాన్పించుచున్నవి. ఇవెవ్వరివై యుండనోపునో పరికించి చూచెద. (పరిశీలించి) తమ్ముల నేలు నీ పదమ్ముల ముద్రలు మా భూపాలునివివలెనే కన్పట్టుచున్నవి. (చెవియొగ్గి) ఏమిది ? ఎవ్వరివో మాటలు వినవచ్చుచున్నవే? (ఆలకించి) ఆ! ఏమనుచున్నారు! వత్సరాజును బ్రద్యోతనమహీపాలుని భటులు బంధించుకొనిపోయి

రనియా! (చెవులు మూసుకొని) అబ్బా! ఇది కలయా! నిక్క
వమా! బందీకృతుఁడైనది మా ఉదయనుఁడేనా! (కొంతవడి
మాటాడనేరక నేలపైఁగుదిలపడి) రాజా! వేఁటవలదనియుఁ దద్వ్యస
నంబున ననేక మహీ కాంతు లింతింతనరాని వంతలఁజివికిరనియు నే
నెంత చెప్పినను పెడచెవినిఁ బెట్టితివికదా! ఎంత పరాక్రమవంతుఁ
డవు! బుద్ధిమంతుఁడవు! దంతిశాస్త్రధీమంతుఁడవు...కట్టా! నేని
చ్చటనే యుండి జరిగిన దానికై యీ రీతి వాపోయిన నేమిప్రయో
జనము. (తటాలునలేచి) సత్వరమ పురమున కరిగి యావద్వృత్తాంత
ము ధిషణాధురంధరుండగు సచివాగ్రగణ్యునకు నివేదించెద. ఆతఁ
డెద్దేని నుపాయాంతరంబు పన్నఁ గలఁడు.

(నిష్క్రమించును)

ద్వితీయాంకము సమాప్తము.



శ్రీ

# వాసవదత్త

## తృతీయాంకము.

ప్రథమరంగము.

ప్రదేశము—ఉద్యానవనము.

(మలయవతీ ప్రద్యోతనులు ప్రవేశింతురు)

ప్రద్యోతనుఁడు—ప్రేయసీ ! మలయసమీరుఁ డెంతహాయిగా వీచుచున్నాఁడు !

గీ. పుష్పవతియైనలతికను ముట్టి పిదప
అమలజలమున ననగాహ మాచరించి
మఱల తాఁకునో యనుశంక మాటుతుండు
మందమందమ్ముగా నిట మసలఁ జొచ్చె !

మలయవతి—దేవర పాండితీపటిమ కెంతయు మెచ్చుకొనవలసినదే!

ప్రద్యో—దేవి ? దానికేమికాని నీవు పుట్టింట నుండినవేళ నీయవయవ సౌష్ఠవముచేఁ బ్రకాశించు నీ సరోవరంబును గాంచి యూఱటను జెందియుంటివి.

మల—నాథా! అది యెట్లు?

ప్రద్యో—నీ మృదుపదసంపదలఁ బోదలు కూర్మంబులు నీ నేత్రభ్రాంతివిరాజిల్లుసాశీఁబపంక్తులు నీ పిసీలకుటిలాలకంబులనేలు చంచరీకసంచయంబులు కలిగిన యీ కాసారము నీ చందంబున విరాజిల్లుటను జేసి.

మల—అలంకారప్రియులగు మీరు...

(తెరలో వాసవదత్త గానము సేయును.)

చ. సలలితభంగిఁ దోచిన వసంతకుమారకు పూజసేయ కై
కలితలతాంగనామణులు కమ్రనికుంజనికేతనంబులం
దలరుల తేనెపేరి కలయంపిని జల్లుచు మేలిముగ్గులం
గలయఁగ దిద్దిరెంతయును గాలికిరాలినపూలపంక్తులన్.

ప్రద్యో—(ఆలకించుటనభినయించి) ఏమి? ఈగానము! ఇంత మాధుర్యధుర్యమైయొప్పారు గానంబు సేయువా రెవ్వరై యుండనోపు? ప్రేయసీ! గానము సకలమానసవశీకరణమనుమాట నిక్కము సుమా!

చ. శిలలు కరంగు జంతువులు చిత్రములట్లు లెసంగు మ్రోడు లా
కులఁ దొడుగుఁ విశాలఫణకోటుల విప్పి చెలంగి పన్నగ
ములు సయితమ్ము నెంతయును మోదపయోనిధిఁ దేలియాడు నో
జలజనిభాస్య! గానమున సర్వజగంబును సొక్కు చెందదే?

మల—అందును మహేంద్రవరప్రసాదలబ్ధయగు మన వాసవదత్త గానమట్టిదేకదా!

ప్రద్యో—ఏమి ? అది వాసవదత్త కంఠస్వరమా !

మల—నాథా ! వత్సయగు వాసవదత్త సంగీతసాహిత్యములందు సమున్నతమై గురుజనులమనంబున కెక్కి సానఁదీర్చిన మణిశలాకవోలె విరాజిల్లుచున్నది కాని

ఆ. వె. అతులమార్దవమున నలరారులతలును
ప్రతిభమీఱి మెఱయు పండితులును
వామగాత్రులగుచు వఱలు కోమలులును
అండ లేక పెంపు నందు టెట్లు ?

ప్రద్యో—అది మెఱుంగక నే యింతనుక నూరకుంటినని తలంచుచుంటివా ? ఎన్నిమారులు వివిధరాజకుమారచిత్రపటప్రదర్శన మాచరించినను మన కుమారితకుఁ దగినవరుఁడు లభింపమి నూరకుంటి. ఏ రాజు నవలోకించిన నేదోకళంకము గన్పట్టుచునే యున్నది.

చ. కులము ప్రసిద్ధమైన గుణకోటులు రూపఱియుండు సద్గుణం
బులు గలచోట రూపపరిపూర్ణత దవ్వయియుండు రూపమే
నెలకొనియున్న విద్దియల నేరుపు చొప్పడ దద్ది యుండినన్
మలయదు శౌర్య మిన్నిఁటికి మైత్రి కుదుర్పడ దొక్కతావునన్.

మల—నాథా! విరూపసంఘటన ప్రమోదచిత్తుండగు నా పరమేష్ఠి చేత లిట్టివే కదా ! ఐనను యుక్తవరాన్వేషణమున కిదే సమయము.

ప్రద్యో—కాంతా! మన మెంత విశ్వప్రయత్నము చేసినను ఈశ్వరనిర్దిష్టకల్యాణకాల మరుదేరకయున్న నిష్ఫలముగాదె?

మల—పురుషప్రయత్నంబు లేకయే యట్టి కల్యాణకాలము రానేర్చునే?

ప్రద్యో—కావుననే భూసురశ్రేష్ఠుఁడగు జయశర్మను వరాన్వేషణార్థము పంపియుంటిని. తడవయ్యెఁగదా!

(భటుఁడరుదెంచి) దేవా! జయమగుఁగాక!

ప్రద్యో—సేవకా! ఇప్పుడేమి తొందర గలిగె?

భటు—బ్రాహ్మణుఁడు మీ దర్శనమునకు వేచియున్నాఁడు. జయశర్మట.

ప్రద్యో—జయశర్మా! సత్వరమే లోనఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము—(నిష్క్రమించును)

మల—దేవరవారు సంకల్పసిద్ధులుగదా!

[జయశర్మయుఁ బేటికనుగొనివచ్చిన భటుఁడును బ్రవేశింతురు.]

మల—ప్రద్యో—భూసురోత్తమా! నమస్సులు.

జయ—(చేయెత్తి) మనోభీష్టసిద్ధిరస్తు! (సేవకునిఁజూచి) నీ వాపేటిక నిందుంచిపొమ్ము.

(భటుఁడు పేటిక నందుంచి వెడలిపోవును)

జయ—రాజేంద్రా! తమసెలవుప్రకారము వరాన్వేషణంబు గావించి వచ్చితిని. ఆయుర్వంతులు సత్త్వవంతులు నధికరూపవంతులునగు మహీకాంతుల చిత్రఫలకంబు లీపేటికయందుఁ గలవు.

**మల**—అయ్యా! నేటికాచ్ఛాదనంబు తొలగింపుడు.

**ప్రద్యో**—(చేయెత్తి) వలదు! వలదు! ప్రేయసీ! జీవనమహాభూజము విస్తరించి పుష్పించి ఫలించుటకు వివాహమే యంకురము. తదంకురావిర్భావమునకు నూత్నవధూవరుల మనోరథమే చక్కనిదోహదము. ఈడువచ్చిన కన్యకల వివాహవిషయమై తలిదండ్రులు పూర్తిగాఁ గలుగఁజేసికొనుటంత వెఱ్ఱితనము వేఱొండులేదు. రుచులు భిన్నంబులై యుండు. ధనాఢ్యుఁడుగాని నీకు నచ్చఁడు. విద్యాఢ్యుఁడు గాని నాకు నచ్చఁడు.

**జయ**—దండిగాఁ బప్పుధప్పళములు దొరకిననేకాని మాకు నచ్చదు.

**ప్రద్యో**—(నవ్వి) ఈరెంటినిఁ బాటింపక యాపె రూపవంతునిఁ గోరుకొనవచ్చు. వరించునది యామెయా మనమా? పరవరణమహోత్సవమున కావత్స యిష్టానిష్టములేకదా ప్రధానము. ప్రాణేశ్వరీ! ఇంకొక్కవిషయము చక్కగా వినుము. మనము చూచినచో నీ కొకఁడు నా కొకఁడు నచ్చవచ్చునుగదా! అప్పు డమ్మాయినిఁ బిలిచి 'ఇతఁడు తగినవాఁడు. పరిణయము గమ్మ'ని చెప్పుదుమేని సిగ్గుచేననేమి మాతృపిత్రాజ్ఞోల్లంఘన మెట్లు సేయుదునను సంకోచముననేమి "తండ్రీ! నీకేది యిష్టమో యదియే నాకిష్ట మనునుగాని వేఱొండు వచించునే? మన మెక్కువ బాధ్యత గలుగఁజేసుకొనినచో నది యనర్థపరంపరలకు నిలయమగును. ఆమెయే వరించిన నన్నిఁటికిని బాధ్యత యామెయందే యుండును.

జయ—దేవా ! అందును మన వాసవదత్త విద్యావివేకసంపన్నురాలు. ఆమెకు వేఱొకరు సెప్పవలయునే ? (మలయవతిని గని) అమ్మా ! ఈ వివాహసందర్భములలో ననర్థంబు లనేకంబులు నేను కన్నులారఁ జూచితిని. దేవరవచించిన దెంతయు సమంజసముగా నున్నది.

ప్రద్యో—మంచిచెడ్డలు మనకుఁ బిదప గోచరము కాఁగలవు. అవసరమైనచోఁ గలుగఁజేసి కొనవచ్చును. సేవకా !
(సేవకుఁడు ప్రవేశించి) దేవా ! ఏమిసెలవు ?

ప్రద్యో—ఓరీ ! ఈ పేటికను గొనిపోయి వాసవదత్త ప్రియసఖి యిందిర కందఁజేయుము.

సేవ—చిత్తము. (పేటికను చేకొనును)

మల—ఔను. బుద్ధిమంతురాలగు నిందిరయే దానికిఁ దగినది.

ప్రద్యో—రాచకార్యపుతొందరలు గలుగకుండునేనిఁ బరిణయము శీఘ్రముగా జరుగఁగలదు.

సేవ—(వెడలిపోవును)

జయ—తథాస్తు. దేవా ! ఇప్పటికే చాల తడవయ్యెను.

([illegible])

(అందఱును నిష్క్రమింతురు)



## ద్వి తీ య ర ం గ ము.



ప్రదేశము—వాసవదత్తమందిరము.

ఇందిర—(ప్రవేశించి పర్యంకమునను న్న వాసవదత్తను సమీపించు
చు) చెలీ ! వాసవదత్తా !...

(రాజముఖి చిత్రపటములను గైకొని ప్రవేశించును)

ఇంది—(వెన్కకుఁజూచి) రాజముఖీ! ఎంతసేపై వచ్చితివే ?

వాస—అది యిప్పుడే కాదటే వచ్చినది.

ఇంది—(పరిశీలించి) నీ చేలాంచలమున మాటుపఱిచి యుంచితి
వదియేమే ?

రాజ—ఓహో ! ఈ యిందిర యిందిందిరయై సందుసందుల దూరి
చూచుచున్నది.

ఇంది—ఓసీ ! కట్టెదుటను బెట్టిన వస్తువు గాన్పింపదాయేమి ?

రాజ—ఆ ! అట్లయిన నివేమో చెప్పుము చూచెదను నీప్రజ్ఞ.

ఇంది—(యోజించి, తలపంకించి) ఆ ! అవి చిత్రములు.

రాజ—(ఇందిరను కౌఁగలించుకొని) ఎంతజాణవే ! చిత్రపటములు
పైకిఁదీసి) నిజముగా నివి చిత్రపటములేనే !

ఇంది—(ఆత్రముతో) ఏవి ! ఏవి ! చిత్రపటములాయవి ! ఏవి ?
ఏవి ? చూడనీ !

రాజ—(మోము గుంచి) నీవేమనుకొంటివే మరి !

ఇంది——(నవ్వి) అవేమో తెలియక యాశ్చర్యమైనఁగాని దాపటి కం బుండదని తలంచి 'అవి చిత్రము'లంటినే!

వాస——(నవ్వి)బలే! బాగుగా వంచించితివే యిందిరా!

రాజ——(తల వాల్చుకొని యూరకుండును)

ఇంది——(రాజముఖి యవనతవదనము నెత్తి) నెచ్చెలీ! చిత్రఫలక సందర్శనకుతూహలాయత్తయగు మన వాసవదత్తకుఁ జిత్తరువులఁజూపింపుము.

రాజ——ఇవిగో! అందులకు నీవే నియోగింపఁబడితివి. (పటముల నామెకిచ్చును)

ఇంది——(పటములను బుచ్చుకొని చదివి యందొకపటమును వాసవదత్తకుఁజూపుచు).

ఉ. కోసలదేశనాయకుఁ డకుంఠితబాహుబలప్రసిద్ధుఁ డ
 వ్వాసవుతోడఁ బోల్పఁ దగువాఁడుసుమీ! కడువైభవంబునన్

(వాసవదత్త విముఖతను సూచించును)

ఇంది——(వేఱొక పటమును జూపి) ఆరాజుకన్న నీరాజు చక్కని వాఁడు.

 భాసురగాత్రి! యీఘనుఁడు పంచశరున్ బలఁదన్ని పుట్టె నీ
 దాసునిగాఁగఁగొన్నఁ దగదా! కురుభూపవతంసు నీతనిన్.

వాస——రాజముఖి! నిన్న నే నేర్పిన దేశాక్షిరాగమును క్రమశిక్షఁ బెట్టితివా? లేదా?

ఇంది——(నవ్వి వేఱొకపటమును జూపి) ఈతనిఁ బలకింపుము.

చ. అగణితరూపశోభితుఁ డహస్కర తేజుఁడు ధీయుతుండు ము
జ్జగముల నేలఁజాలు బలశాలి మహాగుణగణ్యుఁ డిద్ధరన్
విగతసమస్తదోషుఁ డరివీరవనౌఘదవాగ్ని సూవె! యీ
మగధపురాధినాథుఁగనుమా! యనుమానము మాని మానినీ!

వాస—(విముఖతను సూచించును)

ఇంది—(మఱియొకపటమును జూపి) చెలీ! ఈ సింహపరాక్రమునిఁ జూడుము!

ఉ. సంగరరంగదీప్తరిపు సామజకుంభ విదారణక్రియో
త్తుంగమృగేంద్రుఁ డబ్జభవతుల్యవిభాసురధీసమేతుఁ డీ
యంగధరాధినాథుఁడు శుభానన! పావనవంశజాతు రా
ట్పుంగవునిన్ వరించి ఘనభోగము లందుము పంకజేక్షణా!

వాస—(పెడమోము పెట్టును)

రాజ—ఔను. రూపము మాత్ర మెరవు తెచ్చుకోవలయును.

ఇంది—(ఇంకొకపటము దీసి) చెలీ! ఈతఁడు నీకుఁ దప్పక తగిన వాఁడని తోఁచుచున్నది.

శా. పంచత్కాంచనభూధరంబునకు నెంచన్ సాటి ధైర్యంబునన్
బంచాస్త్రున్ వెలివెట్టు రూపమున జన్యక్షోణిలో శత్రులన్
వంచించున్ దనబాహుసత్త్వమున నోవామాక్షి వీక్షించి యీ
పాంచాలాధిపు నేలుకొమ్ము ప్రియుగాఁ బ్రజ్ఞాభరం బేర్పడన్.

వాస—(మోము చిట్లించుకొనును)

ఇంది—(వేఱొండుపటమును దీసి)

సీ. దర్శనీయంబైన తనువిలాసమువాఁడు
తొంగచేనిఁ దెగడు నెమ్మొగమువాఁడు
మదనసౌందర్యంబు మరపింపఁగలవాఁడు
శశికాంతులీను హాసంబువాఁడు
పల్లవంబులఁబోలు పాదయుగ్మమువాఁడు
వెడఁదయై కనుపట్టు నెడఁదవాఁడు
అఖిలశాస్త్రములందు నారితేఱినవాఁడు
ఘనభుజావిక్రమక్రమమువాఁడు
గీ. నీతికోవిదసంస్తవనీయ చతుర
గుణగణశ్రీకళావిభాషణమువాఁడు
ప్రథితచాతుర్య వినయసంపదలవాఁడు
ఇద్ధసామ్రాజ్యలక్ష్మి పెంపెసఁగువాఁడు.

వాస—(తనలో) ఓహో! ఏమి? యీయద్భుతము! ఈచిత్రము సర్వలక్షణాన్వితమైయున్నది. లావణ్యరసము వెల్లివిరియలేదు గదా! (సిగ్గును సూచించును. మందహాసము చేయుచుఁ దలవంచుకొనును.)

రాజ—ఇందిరా? (ఆనందముతో) మన నెచ్చెలి కీతఁ డెంతయుఁ దగియున్నవాఁడుసుమా!

వాస—(సిగ్గునభినయించుచు) అబ్బా! ఎంత ప్రొద్దెక్కినది, పోవు దముఁరండు. (పోఁబోవును)

ఇంది—(ఆమె చేలాంచలమును బట్టుకొని లాగఁబోవును)

వాస—(విదల్చుకొనిపోవును)

ఇంది—నెచ్చెలీ! ఈచిత్రఫలకము నున నెచ్చెలి శయ్యామందిర ముననే భద్రముసేయుదము (ఆచిత్రమునందుఁదగిల్చి తక్కినవి తీసుకొనిపోవును)

(అందఱును నిష్క్రమింతురు.)

తృ తీ యాం క ము.



శ్రీ

# వాసవదత్త

## చతుర్థాంకము.

(శంకరముని ప్రవేశించును)

ఎంతవిపరీతమగు భంగపాటు వాటిల్లినది. దానికిం దగిన ప్రతీకార మీయౌగంధరాయణుఁడు సేయ కూరకుండునా? ప్రద్యోతనా! దుర్నిరీక్ష్యుఁడగు నుదయనమహీపాలుని చెఱ నెంత సాహసకృత్య మొనర్చితివి? (యోజించి) అహ్హాహా! మదించిన వన గజంబును బురికొల్పి యుజ్జయినీపురవీధుల విచ్చలవిడిగా విడిచివచ్చి తిని. అహ్హాహా! అది యీపాటికే రాజసౌధప్రాంతంబు దాదాపు సమీపించుచుండును. నా రూపురేఖలను దిలకించినవా రెవ్వరును మునీంద్రుఁడను గానని సందేహింపరు. శంకరముని పేరు విననివా రును వానిమాట శిరసావహింపనివారును లేరనికదా వినియుంటి. అహ్హాహా! హా! నే నీరూపంబున సకలకార్యంబులను జక్కఁబెట్టఁగ

లను. (పైకిచూచి యోజించుచు) అది వ్యర్థమగునా! పోనిమ్ము. (పెద్దనవ్వుతో) అనంతకోటి యాలోచనల కిక్కువైన యీ బొజ్జ కరిగినఁగదా నా తలఁపు లీడేరకుండుట. ప్రద్యోతనమహీపాలుఁడు బౌద్ధమతవ్యాప్తికిం గడు ప్రయాసపడు చుండెనని తెలిసికొంటిని గదా! వెండియు నాతఁడు యతిపూజాధురంధరుఁడు. (బొడుగఱచి) కపటముచే మా తేనిఁ బట్టించిన ప్రద్యోతనునిఁ గపటముననే వంచించి మా ఱేఁ డా వాసవదత్తను పరిణయంబగు యత్న మొనర్చెద. నా బోధనాపరంపరల నాతని నమ్మించి శ్రీకృష్ణుఁడు బాలామణిని మణిని సంపాదించినట్లు మా ప్రభువు ప్రద్యోతనుని కుమారిమణిని నవంతిరాజ్యరమణినిఁ గూడ సంపాదించు నట్లొనర్చెద. ఒక కన్ను వంశరాజ్యముపైనను నొక కన్నవంతిరాజ్యంబుపైనను బెట్టుకొని యుంటి. అభీష్టసాఫల్యకాలము సమీపింప కుండునా! చూచెదఁగాక...

(నిష్క్రమించును)

---

## ప్రథమరంగము.



( ప్రద్యోతనుని దర్బారు. )

ప్రద్యో—ప్రభాకరా !

గీ. ద్విరదశాస్త్రజ్ఞుఁ బట్టి బంధింపఁబట్టి
వెలికి నానందరస మొక్కపెట్ట నుబికి
సవి నుదయనుఁ బట్టఁగాఁ జాల మనెడి
యధిక తాపాగ్ని శిఖలఁ జల్లార్చె నిపుడు.

కాని యా వత్సరాజుకడ గజవిద్య నభ్యసించినవెనుకఁ గదా సంతో షము. ఆ భాగ్య మేగతినైనఁ జేకూరునా ?

ప్రభా—భూతలేంద్రా ! అన్నియు సమకూర్చినవాఁ డిద్దాని సను కూర్పకుండునా ?

ప్రద్యో—ఆ భూపాలునిఁ దోడ్కొనివత్తునం చరిగి నున భాస్వం తుఁడింకను రాకుండెనేల ?

ప్రభా—(పరికించి) అదె ! భాస్వంతుఁ డుదయనమహీపాలునిఁ దోడ్కొని వచ్చుచున్నట్లున్నది.

(ఉదయనభాస్వంతులు ప్రవేశింతురు)

ప్రద్యో—భూపాలా! ఈ హేమాసనంబు నలంకరింపుఁడు. భాస్వం తా! నీ వా యాసనంబునఁ గూర్చుండుము.

(ఇరువురు నాసీనులగుదురు)

ప్రభా—ఉదయనమహీపాలా ?

కం. దానంబులలో విద్యా
దాన మఖిలభంగులఁ బ్రధానము నాఁగన్
బూని వచింతురు ప్రాజ్ఞులు
గాన నృపా! యర్థి కిడుదె? గజశాస్త్రమ్మున్.

ఉద——మంత్రివర్యా! విద్య యొరులకుఁ జెప్పుటకుఁ గాక దాచు
కొనుటకా? కాని శిష్యధర్మంబులు నెఱపినవారికిఁగాని
విద్య సెప్పరా దను నియమము గలదు.

ప్రద్యో——ఆ నియమంబు లెవ్వి?

ఉద——'అస్మ ద్గురుచరణారవిందాభ్యాం నమః' అని ముందుగా గురు
పూజను గొల్పుట సనాతనాచారం బని మీ రెఱింగిన విష
యమే కదా! వెండియు

సీ. అర్చింపవలెఁ బూజ కప్పుడే విరిసియుఁ
గొనగోట గిల్లని కుసుమచయము
ఈయంగవలెఁ దాల్ప నేఁపూట కాపూట
యుతికిన మడుగుదోవతుల గములు
పానకంబుగావలె నభిషేకమొనరింపఁ
బ్రవిమలాంభఃపూరి భర్మ ఘటము
సమకూర్పవలె దేవ సాన్నిధ్యమందును
స్వాదుమధుర్యంబైన ఫలచయంబు
గీ. స్వాంతమును నిల్పి గురు పాదపద్మములను
భయము భక్తియు మెఱయఁ గొల్వంగవలయుఁ

దత్పరత్వంబుతోడ వేదండశాస్త్ర
మభ్యసించెడునట్టివా రవనిపాల!

ప్రభా—(తనలో) ఓహో! మా రాజుచే నిత్యము వందనము చేయించుకొనవలయుననియా నీ యాశయము.

ప్రద్యో—అటులనా! సరే! ప్రభాకరా! దీనివిషయమై పర్యాలోచన సేయుదము.

[ భయకంపితుఁడగు దౌవారికుఁడు పరుగెత్తుకొని వచ్చి చేతులు జోడించి ]

మహాప్రభో! ఏంచెప్పను! (గడగడ వణఁకుచు) ఏంచెప్పను ...

ప్రద్యో—(సంభ్రమముతో) ఏమిరా? ఏమది? ఏమది?

దౌవా—ఒ ... ఒ ... క పెద్ద మదించిన అడివిఏనుఁగు వీధుల్లో పడి వచ్చుచు దారిలో అడ్డంతగిలినవాళ్ళనందర్నీ ఇట్టే పొట్ట నెట్టుకొంటూ ఘీంకరిస్తూ వస్తోంది. దాన్ని వారించే వారెవ్వరూ లేరు. ఒక్కఁడుగు దాటిపోయిందికాని లేకపోతే అదుగో! అదుగో! ఆ తంబంచాటున దాక్కున్న మునీశరయ్యని తొండానికి చుట్టపెట్టి ఈపాటికి విసిరేసేఉండేది. (భయమును సూచించుచు, చూచి) బాబో! బాబో! అది కోటదాటి లోపలప్రవేశించి వస్తోంది ...

ప్రద్యో—(పరికించి చూచి) ప్రభాకరా! బాణము! బాణము!

శంకరముని—(ప్రవేశించి భయముతో) రా ... జా!

ప్రద్యో—(మునీశ్వరునిఁ జూచి వందనము చేయఁబోవును.)

శంక—సత్కారమునకేమిగాని చూడు! చూడు! ఆగజమాభటు నిఁ జంపివేయుచున్నది.

సేవ—(బాణమందిచ్చును.)

ప్రద్యో—(బాణమును గైకొని త్వరతో లోనికిఁబోవును.)

ప్రభా—కట్టా! ఇదిచిత్రముగా నున్నది. ఆ మదగజమిట కెట్లు వచ్చినది?

భాస్వం—(నిరూపించి) ప్రభాకరా! ప్రభాకరా! అది ఘీంకరించు చు మహారాజుగారిపైఁ బడఁబోవుచున్నది.

ప్రభా—(త్వరతో లోనికిఁ బోవును.)

శంక—(తనలో) అమ్మయ్య! నా యత్నము నెఱవేరినది. ఇంక నాయాశయమును ఫలించుఁగాక!

ఉద—(చిరునవ్వు నవ్వి) భాస్వంతా! అదిమదించి కన్నుగానక తిరుగు వనాటంబని పాప మాప్రద్యోతనుఁ డెఱుంగకున్న వాఁడు. బాణఘాతమాత్రంబునకది లొంగునదియా?

శంక—(నిరూపించి, చూచి వక్షము మోదుకొనుచు) ఇం దెవ్వరు ను గజహృదయ మెఱింగినవారులేరా? పాప మాప్రద్యోత నుఁడు ప్రాణంబులను బాయవలసినదేనా? మంత్రిపుంగవా? ఏమిదారి? ఏమిదారి?

ఉద—(పరిశీలించి) కట్టా! మీ రాజున కెట్టియాపద సంభవించినది పరుల యాపదలను బాపుటకేకదా క్షత్రియకులక్రమాగత ములైన శౌర్యధైర్యప్రతాపములు. భాస్వంతా! నీవు

ముందుగాఁ బోయి "గజహృదయమెఱింగిన యుదయనుఁ డిందున్నవాఁ" డను నక్కరంబులు పొల్లువోకుండ నా యే నుఁగుకడ నుచ్చరింపుము. నే నిదే వచ్చుచున్నాఁడ.

(భాస్వంతుఁడు పోవును.)

( తెరపడును. )

ద్వితీయరంగము.

[ ప్రద్యోతన ప్రభాకర శంకరమునీంద్రులు ప్రవేశింతురు. ]

ప్రద్యో—శంకరమునిచంద్రమా ! ఎంత వింతగా నున్నది. "గజ హృదయ మెఱింగిన యుదయనుఁ డన్నతోడనే యా మత్త మాతంగము ఘీకరించుట మాని మోకరించినది.

శంక—వత్సరాజనామోచ్చారణాంకుశమున కే మదమాతంగము మోకరింపదు ?

ప్రభా—(ఆశ్చర్యముతో) వానికడనున్న గజశాస్త్రము మాత్ర మప్రతిమానము.

ప్రద్యో—సందియమేమి ?

ప్రభా—రాజేంద్రా ! మహాత్ములగు శంకరమునీంద్రుల దిగంతవిశ్రాం తకీర్తి వినుటయేకాని దర్శనభాగ్యము మున్నెన్నఁడును లభింపలేదు. పాపము రాకరాక వచ్చుటయు నుజ్జయినీపురం

ము నేరుసరికి "మత్తగజంబు శంకరమునీంద్రులవారిపైఁ బడఁ బోయినదఁట" యను మాటమాత్రము మాకు దక్కినది.

ప్రద్యో—అమాత్యశేఖరా ! నేఁ డిట్టి మహాత్ముల సందర్శనమువలననే మనము మరల మనఁగల్గితిమి.

ప్రభా—ఔను. ఈ మహాత్ముని కటాక్షముచేతనే మీ మనోరథంబు గూడ నీడేరఁగలదు.

శంక—(నవ్వి) భూదారుల మనోరథంబును జడదారులా యీడేర్చుట. ఆ మనోరథం బెద్ది ?

ప్రభా—వైరివీరుఁడగు నుదయనునిఁ బట్టించుట మా తండ్రి గజశాస్త్రంబభ్యసించుటకే.

శంక—రాజా ! అవశ్య మాశాస్త్ర మభ్యసింపఁ దగినదే. ఔను! నీవే యాశాస్త్ర మభ్యసించినయెడల నిన్ను గన్నెత్తిచూడఁగలరాజు లీ ధరామండలంబున నుందురా ? రేపటినుండి యే విద్య ప్రారంభించు టుచితము.

ప్రద్యో—అది యంత సులభముగా లభ్యమగునట్లు తోఁచదు. ఆ విద్య నేర్చుకొనువార లనేకనియమంబులఁ బాటింపవలయునట.

శంక—ఆ ! ఆ నియమము లెవ్వి ?

ప్రభా—ముందుగా గురువులకుఁ బాదాభివందనమాచరింపవలయునఁట. ఇంక నేమేమో నియమములఁట.

శంక—ఓహో ! రాజా ! చూచితివా ! నీచే నాతఁ డనుదినంబును

వందనము చేయించుకొనపలయునని వాని యాశయము. ఎట్లైనను విద్యమాత్ర మభ్యసింపఁదగినదే. కాని (యోజిం చి) అక్కా! నీ మహారాజపదవికి నీ యౌన్నత్యమునకు నీ యౌదార్యమునకు సాటిరాజునకు సందును నీకులొంగిన శత్రువునకు వందన మాచరింతునా!

ప్రద్యో—మానీంద్రా! అదినిజమే! తద్విద్య గ్రహించుటకు వే ఱొండు మార్గము కానరాకున్నది.

శంక—(ఆలోచించుచు) నీ కుమారునకు నేర్పింపరాదా!

ప్రద్యో—నాకు కుమారులులేరు. కుమార్తెమాత్రమే కలదు.

శంక—అట్లన నామెకే నేర్పింపవచ్చును.

ప్రద్యో—నా కుమార్తె యింకను గన్య.

శంక—ఉ! (యోజించి) పోనీ! కన్యయైననేమి? విద్య గ్రహించు టకుఁ గన్యకలకే కావలసినంత యవకాశముండునుగదా!

ప్రభా—(మందహాసముచేసి) బాగున్నది. అందును నామె సంగీత సాహిత్యంబులం దసమానపాండిత్యము సంపాదించినది. గజశాస్త్రంబు గూడ నభ్యసించినఁ జెప్పవలసినదేమి?

ప్రద్యో—వేఱొండు సంకోచమేమియు లేదు. ఆమె రూపవతి. ఆ రాజు నవయౌవనుఁడగు రూపవంతుఁడు. వారొకరినొకరు చూచుకొనరాదు. చూచుకొనినచో నా యాశయంబునకు భంగంబు గలుగు. అందుపై వైరిరాజునెడ నన్యాయంబు గాఁ బ్రవర్తింపవలసివచ్చును. విద్య గ్రహించినవెనుక నతని

నెట్లైన నిర్జించు యత్నంబు సలిపి వంశావంతిరాజ్యంబు లేక
ముచేయ బద్ధకంకణుఁడనై యుంటి.

శంక—తథాస్తు! రాజా! ఈ రెండురాజ్యంబు లేకమగుటయే నా
యభీష్టంబును. (ఆలోచించి) ఎన్ని విధముల యోజించినను
మీ కుమార్తెకే యీ విద్య నేర్పించుట యుక్తమని తోఁచు
చున్నది.

ప్రద్యో—అది యుక్తమేకాని నా శంకకుఁ బరిహారమెట్లు?

ప్రభా—శంకా నాశంకరుఁడగు శంకరుఁడే దీని కుపాయంబు సేయ
వలయు.

శంక—(ఉపాయమాలోచించి సల్లభినయించి) ఆ! రాజా! నా
కొక చక్కని యుపాయము తట్టినది. ఉదయనున కంగవైకల్య
మగుస్త్రీనిఁ జూడరాదను ప్రతిజ్ఞ యొకటి గలదని విని
యుందు. అది సత్యమేని నేనిరువు రొక యంగవైకల్య
కల్పనము మనకన్యకుఁ గావింపవచ్చును.

ప్రద్యో—సెబాస్! మానిచంద్రా! నా కుమార్తెకు గూడ యు
న్నదండము. అట్టి ప్రతిజ్ఞయే యామెకునుగూడఁ గలదు.

శంక—ఆమె కెట్టి నియమము గలదు?

ప్రద్యో—మడగుజ్జుం జూడనను నియమము గలదు.

శంక—ఆహా! దైవానుకూల్య మెంత చక్కఁగా నున్నది. రాజా!
నీ వన్నిఁటనుగూడ సంకల్పసిద్ధుఁడవు. సరే! నీ వూరకుండు
ము. ఆ రాజునిటకు రప్పింపు మన్నియు నేనే సమకూర్చెద.

ప్రద్యో—భాస్వంతా !

( భాస్వంతుఁడు ప్రవేశించి జోహారొనర్చును. )

ప్రద్యో—ఓయీ! వత్సరాజును భద్రముగా సౌధంబునఁ జేర్చితివా ?

భాస్వం—చిత్తము.

ప్రద్యో—వానితో నిప్పుడు రాచకార్యంబు గలదు. తక్షణమే తోడ్కొనిరమ్ము.

( భాస్వంతుఁ డుదయనునిఁ గొనివచ్చి వెడలిపోవును. )

ప్రద్యో—వత్సరాజా ! ఈ యాసన మలంకరింపుము.

ఉద—(మునికి వందనమాచరించి కూర్చుండును.)

శంక—మనోభీష్టసిద్ధిరస్తు! ఉదయనభూపాలా ! గజశాస్త్రాభ్యాసకు లొనర్చు నియమంబు లేను వినవచ్చునా ?

ఉద—మహాత్మా ! మీ రెఱుంగని ధర్మంబు లున్నవా ? అయినను వినిపించెద. సీ. అర్పింపవలెఁ బూజ ... (అను పద్యమును చదువును.)

శంక—వత్సరాజా! ఈ ప్రద్యోతనున కొక్క_తెయే కుమార్తె గలదు ఆమె గానాదికళలయందుఁ గడుంగడు నేర్పరి. ఎట్టి విద్య యేనియు సూక్ష్మంబుగా గ్రహింపఁగల బుద్ధివిశేషంబుగల దయ్యు దైవయోగంబునఁ గురూపియయ్యె. పరమేశ్వరుని చేత కెవ రేమిచేయుదురు. ఆమెకు గూనే లేకున్నచోఁ

త్రిలోకసుందరి యనఁజెల్లుఁగదా! ఆమెకు గజహృదయమం దెక్కువమక్కువ గలదు.

ప్రద్యో—(తనలో) కడుంగడు యుక్తియుక్తముగా నున్నది.

ఉద—(చెవులు మూసికొని) పాపము శమించునుగాక!

శంక—ఇదేమి పాపము!

ఉద—సంయమీంద్రా! నా కట్టివారినిఁ జూడరా దను నియమంబు గలదు.

శంక—నియమంబులా కఠినములు. అందును విద్య గొందఱకుఁ జెప్పుటయుఁ గొందఱకుఁ జెప్పకుండుటయునా? సాంప్రదాయసిద్ధములని నీవు చెప్పు నియమంబులలో విశేషంబున నీకుంగల నియమంబులు లేవు గదా! సరే! నీ కట్టి ప్రత్యేకనియమంబు గలదేని మీ యిరువురకును మధ్య జవనికను గట్టింతుము. జవనికాంతరముననుండి యామె నీయిష్టము వచ్చినన్ని వందనములు సేయఁగలదు. పిమ్మట నీ వామెకు విద్య గఱపవచ్చునుగదా!

ప్రద్యో—ఈ మాటెంతయో సమంజసముగా నున్నది.

ఉద—అకార్యాచరణంబునకు మన సొప్పునా?

ప్రద్యో—ఇం దకార్యాచరణ మేమున్నది?

శంక—లేనిమాట నిజము. నీ వరుదేరకముందు సకలసంభారములాపె సిద్ధముచేయించియుంచును. పిమ్మట జవనికాంతరమునుండి విద్యనేర్పవచ్చును. నీవు దానికై సందేహింపవలదు.

చ. కరపఁగలేదె? తొల్లి పటకాండము మాటుననుండి తాను భా
స్వరగతి విద్యలెల్లఁ గవిచంద్రుఁడు బిల్హణుఁ డల్ల యామినీ
సరసిజపత్రలోచనకు శంక వహింపక నీవుగూడ స
వ్వరుసనె విద్య నేరుపుము వాసవదత్తకు వత్సభూపతీ!

వెండియు నేత ద్విద్యాభ్యాసానంతర మే యభ్యంతరములేక నిన్ను వదలివేయుదు మంతవఱకు నియమంబుగ విద్య గఱపుము. నీవు బందీకృతుఁడవను శంకవలదు. స్వేచ్ఛావిహారముండును గాని కోట వీడిమాత్రము పోరాదు.

ఉద—తమబోటి యార్యుల వచనంబు లవిలంఘనియములుగదా!

ప్రద్యో—మునిచంద్రా! మీ రాకచేఁ గృతార్థులమైతిమి. మీ జపతపంబులు నిర్విఘ్నంబుగాఁ గొనసాగుచున్నవా?

శంక—బౌద్ధమతావలంబనాసక్తులగు మీవంటి భూపాలు రుండ మాకుఁ గొఱంత గల్గునే?

ప్రద్యో—మీ యభీష్టము లెవ్వియైనఁ దీర్ప సిద్ధముగానున్న యీ దాసున కనుజ్ఞయిండు.

శంక— కేవల బౌద్ధసిద్ధాంతాచరణాసక్తులమగు మా కేడ? కోర్కు లేడ? అంగ మగధ కాశి కోసల కురు పాంచాలాది రాజ్యంబులం దిరిగి యా యా రాజులకు బౌద్ధమతసిద్ధాంతములను బోధించుచు గుణసంపన్నుఁడవగు నిన్నుగూడఁ జూచి పోవలయునని వచ్చితిని.

ప్రభా—మా తేఁడు బౌద్ధసిద్ధాంతముల నీవఱకే యాచరణలోఁ బెట్టించె.

శంక—మీ రాజుచే నీవే సిద్ధాంతముల నాచరణలోఁ బెట్టింపలేవు.

ప్రద్యో—మునిశ్రేష్ఠా! ధర్మసంస్థాపకులగు మీరుపదేశించు ధర్మంబుల వినఁగోరుచున్నాఁడ.

శంక—నేనా మీకు ధర్మోపదేశంబు సేయుట. ధర్మదేవతకుఁ బుడమి ఱేఁడే గద గదా!

ఉద—భూపతులు మర్త్యులు. సకలధర్మవిదులయ్యును చారులే చక్షు రింద్రియములుగాఁగల రాజులకడ ధర్మము తాఱుమాఱు కాకుండునా?

శంక—అయిన నాకోలఁది వచించెద.

గీ. రాజుఁ గన ననుకంప నారాయణుండు
రాజుఁ గన దండనంబున రవిసుతుండు
రాజుఁ గనఁ బాలనంబున రామమూర్తి
రాజనామ మమూల్యంబు రాజచంద్ర!

దండనంబునఁ గడు జాగరూకుఁడై మండలేశ్వరుఁడు సంచరింపవలయును. స్నేహ బాంధవ్యములను బరిత్యజించి యపరాధులను నిష్పక్షపాతబుద్ధితో శిక్షింపవలయును. భూమీశుఁడు కామక్రోధజనితంబులగు సప్తవ్యసనంబులను త్యజించి పూవిసుమంతయుఁ గందకుండ మిళిందము మకరందమును గ్రోలుభంగి జనుల కిసుమంతయు నొప్పి కలుగకుండ వారికడఁ బన్నులను గ్రహించుచుండవలయును. ఈటెకుపన్ను మాటకుపన్ను బాటకుపన్ను తోటకుపన్ను పొలముపన్ను జలముపన్ను కొట్టుపన్ను జుట్టుపన్ను బట్టపన్ను మాటిమాటికిఁ

బన్ను విధించెదు భూపతిరాజ్యరమ ప్రజాప్రీతికరంబు గాఁజాలదుసుమా! రాజు ప్రజలకడఁ బన్ను వసూలుచేయుటలో నతివృష్టి యనావృష్టివలనఁ గీడు వాటిల్లినచో వారిని రాక్షసులవలెఁ బీడించి కప్పంబులను గైకొనరాదు. రాజా! బుద్ధదేవుని శిష్యులమగుట యహింసయు సర్వభూతములందును దయయుఁ బ్రజలకు నిరంతరమును బోధ చేయుచుండవలయును. బౌద్ధసిద్ధాంతములను మఱువకు సుమా!

ప్రద్యో—మీ యాజ్ఞానుసారము నడరలఁ బురమునఁ జాటఁ బంపెదను.

శంక—నా కింక సెలవొసంగుము.

(అందఱును లేచి నిలఁబడి శంకరమునికి నమస్కారము సేతురు.)

( తెరపడును. )

తృతీయరంగము.



[ వాసవదత్త యుద్యానవనమునందొక వేదికపైఁ గూర్చుండి వత్సరాజు చిత్రఫలకము నఱచేతనుంచుకొని చూచుచు ]

వాస—వీనియెడ నాకుంగల మోహసాగరమునకు మేరయేలేదు. ఒంటరినైన నాలో నేనే తలపోసుకొనినఁగాని మనశ్శాంతి చేకూరదు. అహో!

హాసవదత్త.

సీ. వీక్షింపవలదె? యీ విశ్వమోహనరూప
మక్షిద్వయంబు ధన్యత్వ మంద
ముద్దాడవలదె? యీ మురిపెంపుఁజెక్కిళ్లు
పెదవి కయ్యది మహాపదవి గాఁగ
ఆలింపవలదె? యీ యసమాన సునుబల్కు
వీనుదోయికి దొడ్డ విభవ మబ్బ
పట్టంగవలదె? యీ పాదపంకేజముల్
పాణు లున్నందుకు ఫలము గలుగ
గీ. రమ్యతముఁడైన యీ మహారాజుఁగూడి
చెలువు గులికెడు నుద్యాన తలులయందు
నింపు సొంపు నింపఁగ విహరింప వలదె?
పుట్టువునకెల్ల భాగ్యంబు పొందు పడగ.

రాకాశశాంకు నిరసించు నెమ్మోమును తమ్ముల బెడంగు నడంచు నేత్రపద్మములును నింపు నింపు నూనూగుమీసములును వేదండశుండా దండముల నోర్చు భుజకాండములును గల యీ రాజశేఖరుఁ డెక్కడ? అల్పసౌందర్యవతినగు నే నెక్కడ? మందభాగ్యనగు నా కీమహాత్ముని దర్శనమెన్నటికైనఁ గల్గునా? ఈ చక్రవర్తి నా చిత్త సామ్రాజ్యంబు నేలు చక్రవర్తి. ఇతనికే తచ్చిత్తసామ్రాజ్యాంతరస్థ మగు నా యమూల్యప్రేమయను ఖజానా యంతయు సమర్పించితిని. ఈ సుందరాకారునిఁ గనులారఁ గాంచు భాగ్యంబు గలుగునేని యతని పాదములపైఁబడి నన్నేలుకొనుమని ప్రార్థించెద. తిరస్కరిం

చునా ! తిరస్కరించునేని నప్పుడే యతని కోమలపదాబ్జాతంబులకు నా ప్రాణంబు లరణంబుగా సమర్పించెద.

( చప్పుడగును. )

వాస—(అటునిటు చూచి నిలచి) ఎవరది ?

[ మదనోన్మాదుఁడగు చండభానుఁడు మీసముపైఁ జేయి వేసుకొని ఠీవిగాఁ బ్రవేశించును. ]

చండ—(నవ్వుచు) నేను చండభానుఁడను.

వాస—(తటాలునఁ బటము నక్కున నదుముకొని) ఏల యీ యుద్యానవనంబు ప్రవేశించెదవు ?

చండ—రాఁగూడదా ? (నవ్వును.)

వాస—మగువ లుద్యానవనవిహారము సేయుచుండ మగవా రేతెంతురా ?

చండ—మగువల కొఱకైన మగవారు రారా ?

వాస—ఏమి ? కావరము ! నా యెఱుక లేనిదే నీ విట్లు చొరఁబడ వచ్చునా ? పొమ్ము ! (వ్రేలుచూపును.)

చండ—నీ యెఱుకతో గిరుకతో నా కేమిపని ? వాసవదత్తను గొనిపోవు సర్వాధికారము నాకు గలదు.

వాస—అట్టి యధికార మెవఁడిచ్చెను ?

చండ—ఒకఁడు కాఁ డిద్దరొసంగిరి.

వాస—ఆ యిరువు రెవరెవరు ?

చండ—సర్వస్వతంత్రుఁడగు వలరాజును ...

వాస—ఛీ! దురాత్మా! వలరాజు వలలో నీవు పడినఁ బడుదువు గాక. వానికి సర్వస్వాతంత్ర్యము నాపై నేమియులేదు.

చండ—(నవ్వుచు) పోనిమ్ము. సర్వాధికారియగు ప్రద్యోతనుఁడును గదా!

వాస—ఆ! ప్రద్యోతనమహారాజా! అది యెట్లు?

చండ—(తనలో) ఈమె దారిలోనికి వచ్చుచున్నట్లు తోఁచెడిని. ఇట్లు ప్రసన్నురాలునిగాఁ జేసుకొనియెద. (ప్రకాశముగా) కొండొక రాచకార్యంబున వంశ నిర్మూలనంబు సేయ యత్నించుటకును దానికి ఫలంబుగా నా కర్ధరాజ్యం బిచ్చి... కాంతా!... కాదు! కాదు!... తొలుత నిన్నిచ్చుటకును బిదప నర్ధరాజ్య మిచ్చుటకును—

వాస—నా యభీష్టము నెఱవేర్చు తంత్రి యన్నోల చెప్పును! ఇదంతయు నీ కౌటిల్యప్రభావము.

చండ—కాంతా! కౌటిల్యప్రభావము నీ యలకలయందే కాని నా మాటలయందు లేదు.

వాస—మిథ్యావచనా! ఏల నన్ను నమ్మింపఁ జూచెదవు?

చండ—(నవ్వుచు) మిథ్యాత్వము నీ మధ్యమందే కాని నా పలుకుల యందుఁ గలదే?

వాస—చపలమతీ! నీ యిచ్చకంబులకు నిచ్చ మెచ్చుకొనుదానను గాను.

చండ—చపల నీ దేహమందే కాని నా మతియందు లేదు. నిజవస్తు కథన మిచ్చక మెట్లగును ?

వాస—అట్టి కథనము నిజమయ్యెను నీకు ఫలంబు లేమిచే నిచ్చకం బయ్యె.

చండ—పాపపంతుఁడసగు రాక్షసుని నన్నుఁ బరిణయమాడ సంకోచింపనేల ?

వాస—సిగ్గు ! సిగ్గు ! ఆత్మశ్లాఘ్యము రాజపుత్రునకు లక్షణమా ?

చండ—సకలలక్షణసమన్వితవగు నో తన్వీ ! నా బ్రదుకంతయు నీ చేతిలో నున్నది. నీ తండ్రిచే నియోగింపఁబడి పరరాజ్యాసం పాదనారతుండనై మగధకుఁ బోయియు నిన్ను దలంపని ఘ డియయేలేదు. నిన్ను బ్రతిమాలుటకే యెప్పు డొంటిపా టౌదవునా యని వేచివేచి నేఁ డిచ్చటికి వచ్చితిని. నన్ను వృథా నలయింపక వరియింపుము.

వాస—మూర్ఖా ! ఇప్పుడు నన్ను వరించుట పండుగవెన్నెల వాఁచి యనఁదగు. వచ్చిన దారినే పొమ్ము.

చండ—నీ యసంబద్ధపుమాటలకే చండభానుఁడు విడచి పోవు వాఁడా ?

వాస—ఊరకపోవువాఁడు గాఁడు. సగముచచ్చి తలవంచుకొని పో వలసినవాఁడే !

చండ—ఏమి? తృణీకారము మితిమీఱుచున్నది! నన్నుఁ బరిణయ మాడెదవా ? లేదా ?

వాస—నీ కొంతయు గ్రహణశక్తి లేదా ? ఆమె యీవఱకే యొకనిని వరించి మనస్సుచేత వివాహితయునయ్యె. పొమ్ము ! పొమ్ము !

చండ—(క్రోధముతో) ఆ ! ఎవరిని ?

వాస—నా హృదయఫలకమం దున్నవారిని.

చండ—(అక్కడ నడుముకొనియున్న చిత్రపటముచూచి) కాంతా ఆ చిత్రఫలక మెవనిది ?

వాస—నా మనోహరునిదే !

చండ—ఆ ! ఎట్లు ? (క్రోధముతోఁ బటము లాగుకొని చూచును.)

వాస—ఓరీ ! దురాత్మ ! నీ కెంతకండకావరము. చేతనున్నపటము నూడఁబెఱికితివిగాని నా చిత్తముద్రితమైనదాని నూడఁబెఱుకఁగలవా ? తులువా !

చండ—నా కరగృహీత వయ్యెదవా ? లేదా ? చెప్పుము.

వాస—తారతమ్యము గ్రహించి దూరముగానుండి మాట్లాడుము. (కొంచెము దూరము పోఁబోవును.)

చండ—ఏమి ? సమాధానమొసంగక నిన్నుఁ బోనిచ్చువాఁడనా ! (చేయి పట్టుకొనఁబోవును.)

వాస—(కోపసంభ్రమములతో) ఛీ ! పశువా ! అబలలయెడ నింత సాహసమా? ఇది పౌరుషకార్యమా? దూరముగానుండుము.

చండ—(క్రోధముతో) నన్నుఁగాక వీని నెట్లు పరిణయ మయ్యెదవో చూచెద. (ఆ పటమును గ్రిందఁ బడవైచి) వీనింబోలె నిన్నును నలిపివేయఁగలను జాగ్రత్త.

వాస—ఓరీ! అసమర్థా! నీచవాక్ప్రలాపీ! నీ బెదరింపుల కేమిలే? (పిడికిలి పైకెత్తి) నిన్నిప్పుడేమి చేసెదనో చూడు ...

ఉదయనుఁడు—(ప్రవేశించి) ఏమి యీ యార్తనాదము? కలభాషిణీస్వరంబువలె వినవచ్చుచున్నది. (కలయఁజూచి)

పంచచామరము- అరే! మహోగ్రకల్మషాత్మ! ఆగడం బిదేలరా!
పరాంగనాలలామ నిట్లు పాడియౌనురా! బలా
త్కరింపఁగా దురాత్మ! నీదు కండకావరం బిదే
హరించి నొంచి ద్రుంచి ప్రోతు నార్తులైనవారలన్

చండ—(ఆశ్చర్యక్రోధములతో) నీ వెవ్వఁడవు?

ఉద—నేనా! దుర్మార్గులపాలిటి దండధరుఁడను. (మెడఁబట్టి వానిని గ్రిందఁ బడవైచును.)

చండ—హా! హతోస్మి! హతోస్మి ...

వాస—(ఆశ్చర్యానందములతో నుదయనునిఁ జూచి, తనలో) మదీయార్తత్రాణపరాయణుండగు నీతఁ డెవండు? అస్మదీయహృద్గతవిభునివలెఁ గాన్పించెడిని. ఇదికలయా! నిక్కవమా! నా కన్నులు నన్ను మోసపుచ్చుటలేదుకదా! (తెప్పలప్పళించి) లేదు! లేదు! నా పూర్వపుణ్యఫల మితనిని సాక్షాత్కరింపఁజేసె. (సిగ్గుచే తలవంచుకొనును.)

ఉద—(క్రిందనున్న చిత్రఫలకము చూచి) ఈ చిత్రఫలకము నాదియామేమి చెప్పుమా! (నిరూపించి) నాదియే! ఈమె నన్నే యభిలషించుచుండెనా? ఆహా! నా భాగ్యమహాభూజము ఫలించునాయేమి? ఈ సర్వాంగసుందరి యెవ్వతెయై యుం

డనోపు. ప్రసంగించి చూచెద. (ప్రకాశముగా) లతాంగీ! నీ వొంటిగా నివ్వనంబున కేలవచ్చితివి?

వాస—(తనలో) నే నొంటరి నెట్లౌదును. నా మనస్సునందు నీవు లేవా? (ప్రకాశముగా) ఇది ప్రమదోద్యానమేకదా! ఇం దొంటరితనమేమి?

ఉద—కాంతా! భవాదృశమైన వనితారత్న మే కులము సముద్ధరించె? ఏ యక్షరంబులు నీపేరు సమకూర్చి పవిత్రంబులైనవి?

వాస—(క్రిందనున్న చిత్రఫలకము దీసుకొని తలవంచుకొని సిగ్గుతో) మహాభాగా! క్షత్రియకన్యలు తమనామంబులు పేర్కొనుట యుక్తము కాదుగదా!

(తెరలో) సఖీ! సఖీ! ఎందుంటి వెందుంటివి?

వాస—(విషాదముతో) అయ్యో! ఈ చెలికత్తెలు నా కెక్కడ దాపరించిరి. వీరి నోటిలో నూవుగింజయైనను నానదు. వారి దృష్టిపథంబునఁ బడకముందే యిటనుండి పోవలయును. (పోవుచు వెనుకకుఁ దిరిగి చూచుచు పోవును.)

ఉద—అబ్బా! నా ప్రాణసఖి నన్ను వీడి పోవుచున్నదే! నెచ్చెలీ! న న్నొక్కసారి స్వర్గ్లోకసింహాసనాధిష్ఠునిఁ జేసి తటాలున నరకకూపంబునఁ బడఁద్రోసి పోవుచుంటివా! నీ ముఖేందుకాంతులచేఁ బ్రకాశించిన యీ వన మిప్పు డంధకారావృత మగుచున్నది. (అటునిటు తిలకించి) అదిగో! నా కలకంఠి సుధామధురోక్తుల నింకను చాటునుండి వినిపించు

చున్నది. ఆ పాడునెచ్చెలులనెట్లో సాగనంపి మరల వచ్చుచుండెను గావలయు. (నిరూపించి) ఓసి పరభృతమా! నీవు నన్నెంత మోసగించితివే? కౌను. గుణములు పెంపునకుఁ దగినట్లే యుండునుగదా! (యోచించి) ఆ నిష్కళంకరాకాచంద్రమండలముఖి యెవ్వరోగదా! ప్రద్యోతనమహారాజు కుమార్తె యనఁబడుచున్న నీమొకు గూనున్న మాటయే లేదే? వాని కింకను గుమార్తెలు గలరా? లేరు. వాసవదత్త యొక్కతెయే కదా కుమార్తె. మరి యీమె యెవ్వతెయై యుండనోపు? అయ్యో! నేను సెప్పకున్నమానె— ఆ పాడునెచ్చెలులు రాకుండినఁ—నూర్వైనను తుది కావాసమైనను చెప్పియుండెడిదేమో? నేఁడీ యుద్యానవనపార్శ్వంబునకు సాయంవిహారమునకు వచ్చుట మేలే యయ్యెనని తలంచితిని కాని

సీ. అమృతాంశు నిరసించు నబ్జాక్షి నెమ్మోము
నెలమిమై ముట్టి పైకెత్తనైతి
మాటమాటకు సుధా మాధుర్యమును జిందు
నేణాక్షి పలుకు లాలింపనైతి
తళుక్కటద్దంబట్లు తనరు చేడియ చెక్కు
నాదరం బొలయ ముద్దాడనైతి
తరళాక్షి తనువును దనువుతోఁ గదియించి
యాశ్లేషసౌఖ్యంబు నందనైతి

గీ. జఘనతలకాంచిభూషణజనితకింకి
ణీస్వరమను స్వాగతము మన్నింపనైతి
కడకుఁ దల్లోకమోహనాకారమైనఁ
గాంచనైతిని కన్నుల కఱవుదీఱ.

ఆపె యెవ్వతెయో నిజనివాసాగార మెయ్యదియో యెఱుంగనప్పు
డు నాకుఁ బరిపూర్ణమనోరథసిద్ధి యెట్లు చేకూరఁగలదు? (పరికించి)
ఓహో! నా సౌధంబు చేరు నిర్ణీతకాలము సమీపించినది. నేఁ
బోవలయు——

( నిష్క్రమించును. )

చతుర్థాంకము సమాప్తము.



శ్రీ

# వాసవదత్త

## పంచమాంకము.



ప్రదేశము — ఉద్యానవనము.

[ మనోరమ ప్రవేశించును. ]

మనో—(ఇటునటు కలయఁజూచి) రాజముఖీ! రాజముఖీ!

రాజ—(ప్రవేశించి) చెలీ! ఏమే! నేఁడు చాలా ఆదుర్దాపడు చుంటివి?

మనో—మన యిందిర యేదీ? నిన్నటి వృత్తాంతము సాంతముగా వినలేదే!

ఇందిర—(ప్రవేశించును.)

మనో—(చూచి) ఇందిరా! అవును గాని నిన్నటి వృత్తాంతమంత యుఁ జెప్పక సగము చెప్పి యూరకుంటివేమే?

రాజ—నయంగాదూ! దీనికి మొండితేలు కుట్టలేదు.

ఇంది—ఇదిగో! ఇప్పుడు చెప్పెదను వినుము. ఆవిధముగా గజో త్పత్తి గజపోషణ గజారోహణ గజచికిత్స గజవ్యూహము తద్వ్యూహభేదనోపాయములు గజములసాహాయ్యంబున సమరము గజశాస్త్రపారంగతులపేరు వినినంత గజములుభయకంపితములగుట ... ఒకటననేల? ... ఆశాస్త్రంబునంగల విషయంబులన్నిఁటను వత్సరాజ వాసవదత్తల కిరువురకును గజశాస్త్ర చర్చ జరిగినది.

రాజ—తిరిగి నేఁడీ సన్నాహమంతయునేమి ?

ఇంది—ఇంత సూక్ష్మంబుగా గజశాస్త్రమంతయు గ్రహించిన మన నెచ్చెలి కుశాగ్రబుద్ధి కెంతయు మెచ్చుకొని యీ ఱేఁడు మరల నేఁడు పరీక్షావిధాన మేర్పఱచినాఁడు.

మనో—గజశాస్త్రమందేనా ?

ఇంది—అబ్బే! కాదు! కాదు! లౌకిక జ్ఞానమం దని తోఁచుచున్నది.

రాజ—పోనీ! తక్కుంగల శాస్త్రములయందును ప్రాపంచికజ్ఞాన విషయంబులలోను మన నెచ్చెలి యసామాన్యయేకదా!

[ మాలతీ సమేతయై వాసవదత్త పూసజ్జ చేతఁగొని ప్రవేశించును ]

మాల—ప్రియసఖి! ఇదిగో! వారీ మార్గంబుననే యుద్యానవనమునఁ బ్రవేశించియుండిరి. సత్వరము పోయి కలుసుకొందము (కొంచెము ముందున కిరువురు నడుతురు.)

రాజ—(నిరూపించి) చెలులారా! అదే! వాసవదత్త మాలతీసమే

తమై వచ్చుచున్నది. ఎదురేగి తోడ్కొనివత్తము రండు. (చెలు లొకరి భుజములపై నొకరు చేతులు వైచుకొని ముందు నడుతురు.)

వాస—సఖీమణులారా! దోహదప్రక్రియ కన్నియు సమకూర్చితిరా? (కొంచెము నడిచి) అయ్యో! పాపము! ఈ లతాతన్వి శుష్కించి యెట్లున్నదో చూడుము.

మాల—(చిరునగవుతో వాసవదత్తను చూపుచు) ఔనౌను. ఈ లతాతన్వి యెట్లు కృశించియున్నదో చూడుము!

మనో—పాప మాశ్రయవిహీనజీవన మిట్టిదేకదా!

రాజ—ఈ రంభాభూరుహమునకు దోహదమెంత కూర్చినను నేపుగాఁ బెరుఁగక యిట్లే యున్నదేమే!

ఇంది—(నవ్వి) మన నెచ్చెలి రంభాతిరస్కారువులగు నూరువులఁ గాంచి సిగ్గుఁజెంది తలయెత్తుకొనలేక యట్లేయున్నది.

వాస—చెలీ! నీ యిచ్చకపుమాటలు చాలునులే. ఈ మందార పారిజాతాదులకు దోహదము సేయుము.

మాల—నేను నీ ప్రియ లతా గుల్మంబులకు నీరు పోసెద. (వారి పూర్ణఘటంబు నందుకొని నీరు పోయుట నభినయించును)

ఇంది—చెలీ! దూరము! దూరము!

వాస—అదేమే?

ఇంది—చూచితివా! ఆ గండు తుమ్మెదల పిండు. నీ కుటిలకుంతలములఁ గాంచి యళులని భ్రమించి రొదసేయుచు నిన్నుం జేరి శ్రమఁగలిగింపనున్నవి.

వాస—(చిరునవ్వు నవ్వి) దోహదము సేయుచుందును. నేనీ మా లతీకుసుమగుచ్ఛంబులు గోసి నా వరునకు ... (విభ్రాంతితో చెవులు మూసుకొని) ఎంత పొరపడితిని ... నా గురున కొసంగెద.

ఇంది—(పుష్పములు కోసి సజ్జను భద్రపఱచును.)

వాస—(పరికించి చూచి)

గీ. కలువ కనుమూయఁ దారకల్ కాంతిఁబాయ
ఖగకులమ్ములు గూయఁ జీకటులు మాయఁ
బద్మినీకాంత మదిలోస వంతఁబాయఁ
బొడమె నల్లదె ! చూడు మంభోజహితుఁడు.

మాల—నెచ్చెలీ ! అట్లయిన నింకఁ దడవు సేయుటకుఁ గాలంబు చాలదు. నీ ప్రేమాస్పదంబగు చిరుచంపకభూజంబునకు నీరు వోయుదువా ?

వాస—ఆ ! మఱచితిని. ఏదీ ! వారిప్రపూర్ణకలశం బిటు తెమ్ము.

(తెరలో) ఘంటారవము వినవచ్చును.

ఇంది—(ఆలకించి) చెలీ ! అదె ! ప్రథమఘంటారావము. నీ గురువరులు రానున్నారని చాటుచున్నది. వలయు సంభారంబు లన్నియు నుచితరీతి సిద్ధపఱుపఁబడియే యున్నవి. చెలులారా ! మనము పోవుదము రండు.

వాస—నడువుడు ! నడువుడు ! (అందఱును నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము.

### స్థలము—పటకాండప్రదేశము.

[ వాసవదత్త పూలసజ్జను దీసుకొని ప్రవేశించి పటకాండమున కొక వైపున నమర్చఁబడిన వేదికపైనుంచి రెండవవైపునఁ గూర్చుండును]

వాస—ఆహా! ఏమి యీ పండితాగ్రగణ్యుని ధీవిశేషము! పారావారమునకైనఁ బారంబు గలదు గాని వీరి విద్యాసముద్రమున కేపారమును గానరాదు. ఈ మహాత్ముని గన్నతల్లి యేనోములు నోచినదో కదా! ఏపురీమతల్లి యిప్పండితకులాలంకారునిచే నలంకృతమై విరాజిల్లుచున్నదో! ఇట్టి శాస్త్రప్రతికళాస్పందుని నయనానందకరముగాఁ జూచు నా జనకాదుల భాగ్యమే భాగ్యము. పుట్టినతోడనే వాడి పోవుస్వభావముగల పుష్పమాతకు జనించిన యాబ్రహ్మ యీధీశాలికి మడగుజ్జతనంబాపాదింపఁజేసెనే? (యోచించుచు) ఇట్టి గంభీరవాగ్విజృంభణముగలవారికి మడగుజ్జతనం బెట్లుఘటిల్లు? ఇది మిషయై యుండదుగదా! మిష పెట్టవలసినంతటి యగత్యమేమి? నాజనకుఁడట్లేల చేయును? (తటాలున) ఏమిది? నా యెడమకన్నదరుచున్నదే! నేటి ప్రశ్నోత్తరంబు లెట్లు పరిణమించునో? జయప్రదమని యీ శుభమే సూచించుచున్నది —

(తెరలో ద్వితీయ ఘంటారావము వినవచ్చును.)

వాస—(ఆలకించి) అదె! రెండవఘుంట వినవచ్చుచున్నది. ఇంతలో గురుస్తుతిఁ గావించెద. (ధ్యానించుట నభినయించును.)

ఉదయనుఁడు—(ప్రవేశించి) ఆహా! ఏమి? ఆపె కుశాగ్రబుద్ధి. నిన్న నామెను గజశాస్త్రంబునం దోడింపఁ బ్రయత్నించితి. ఆమె నాకడ విద్యనేర్చి నన్నే తిరస్కరించుచున్నది. లోకములో గురువును మించిన శిష్యులుందురనుమాట నిజము. ఔరా! స్త్రీల బుద్ధి సూక్ష్మంబని చెప్పుదురు. అందును నివ్వనిత బుద్ధి సూక్ష్మతరంబై యేపారుచున్నది. ఇట్టి యపర భారతికి గూను గల్పించిన ధాత నేమనవలయును. ఔరా!

సీ. పదునారు కళలచేఁ బరఁగు కళానిధి
కెనరానిమచ్చ గల్పించినాఁడు
రతనాలగనియైన క్షితిధరేంద్రునియందు
మించిన మంచు నిర్మించినాఁడు
సకలలోకపవిత్రజలముచే నొప్పారు
కడలి లోపల నుప్పు గలిపినాఁడు
సౌరభమ్ములనీను చందనద్రుమముల
ఘోరాహివారంబు గూర్చినాఁడు

గీ. మంచి విరులకు ముండ్లు సంధించినాఁడు
లలిత సర్వకళాకాండ కలితయైన
యీ వధూటికి గూను గల్పించినాఁడు
తలఁప నెంతటి యవివేకి జలజభవుఁడు.

(యోజించి) నేఁడేవిధినైన నామె నోడించు యత్నము చేసెద (ముందునకు నడిచి పటకాండమునకు రెండవవైపునం దాసీనుఁ డగును.)

వాస—(గురుని రాకఁగనిపెట్టి) గురువరా!

గీ. సకల భువనైక వీర సంశ్లాఘ్యమైన
మహితమాతంగ శాస్త్రమర్మముల నెల్లఁ
దెలిపితివి నాకు వాత్సల్య కలిత మతిని
మ్రొక్కు ఘటియింతు మీ పదమ్ములకు జాఁగి.

ఉద—వనితారత్నమా! ఈప్సితార్థసిద్ధిరస్తు! నేటి పరీక్షావిధానమునకు సిద్ధముగా నుంటివా?

వాస—సర్వము భవదమోఘాశీర్వాదప్రభావమే కదా!

ఉద—(తనలో) నేఁడీమెను లోకజ్ఞానపరీక్షకు వాటంబులగు కూటంబు లడిగి యోడించెద. (ప్రకాశముగా) వనితా!

శ్లో॥ ఏకచక్షుర్న కాకోయం బిల మిచ్ఛన్న పన్నగః
క్షీయతే వర్ధతే చైవ న సముద్రో న చంద్రమాః॥

దీని కుత్తరం బిమ్ము.

వాస—(తనలో) ఓహో! ఈతఁడు కూటంబు లడిగి న న్నోడింప యత్నించుచుండనోపు. కానిమ్ము. (ప్రకాశముగా) గురువరా! కన్నొకటి కలదు గాని కాకి కాదా?

ఉద—కాదు!

వాస—రంధ్రమును గోరును గాని పాము కాదు. క్షయము వృద్ధి

కలవు కాని సముద్రుఁడునూ కాఁడు చంద్రుఁడునూ కాఁడు.
అట్టిదేది ? ఆ ! ఔను ! అది సూచిక కాదా ?

ఉద——(మందహాసము చేసి) ఔను !

వాస——గురువరా ! అడుగుటకు నా కనుజ్ఞ నిచ్చెదరా ?

ఉద——అవశ్య మడుగవచ్చును.

వాస——

శ్లో॥ ఛత్రధారీ న రాజాసౌ జటాధారీ న చేశ్వరః
సృష్టికర్తా న చ బ్రహ్మా ఛిద్రకర్తా న తస్కరః ॥

ఉద——(ఆలోచించి) ఛత్రధారి కాని రాజు గాఁడూ ! జటాధారియే కాని యీశ్వరుఁడు గాఁడా ! సృష్టికర్తయే కాని బ్రహ్మ కాఁడా? కన్నము త్రవ్వును కాని దొంగ కాఁడు. ఉహూ ! ఔను. అది బులిగిపోయిన కొజ్జు. వనితా ! దీనిని సాధించుటలో నీ ప్రజ్ఞ చూచెదము.

వాస——నా ప్రజ్ఞ యేమున్నది ? ఇదంతయు మీరు పెట్టిన భిక్షయే కదా సెలవీయుఁడు.

ఉద——కం సంజఘాన కృష్ణః ?

వాస——(తనలో) కృష్ణుఁడెవనినిఁ జంపెను ? (నవ్వి) ఇదియు నొక ప్రశ్నయేనా ? ... చిత్ర మేమేనున్నదా ? ... ఓహో ! ఇదియా ! తొలియక్షరముల రెంటిని గలిపినసరి ...
(ప్రకాశముగా) కంసం జఘాన కృష్ణః

ఉద——కా శీతలవాహినీ గంగా ?

వాస—సరే! కాశీతలవాహినీ గంగా. గురువరా! అడుగుటకు నా కనుజ్ఞ యిచ్చెదరా ?

ఉద—ఓ! అవశ్యము.

వాస—కే దారపోషణరతాః ?

ఉద—(మందహాసముచేసి, తనలో) ఈమె యెందును తీసిపోవునట్లు లేదు. (ప్రకాశముగా) కేదారపోషణరతాః

వాస—కం బలవంతం నబాధతే శీతం

ఉద—కంబలవంతం నబాధతే శీతం (తనలో) ఈమె నోడించుట దుర్ఘటముగా నున్నది. సరే! దీనితో నీమె బుద్ధివిశేషము వెల్లడికాఁగలదు. (ప్రకాశముగా)

శ్లో॥ అస్తి నాస్తి శిరోనాస్తి బాహు రస్తి నిరంగులిః
నాస్తి పాదద్వయం గాఢ మాలింగిత స్స్వయమ్ ॥

వాస—(ఆలోచించి, తలపంకించి) ఎముక శిరస్సు లేవు కాని చేతు లున్నవఁట. చేతు లున్నవి కాని వ్రేళ్లు లేవఁట. ఏమిది ? చిత్రముగా నున్నదే? పాదములు లేకయే గాఢాలింగనము స్వయముగాఁ జేసుకొనునా ? అబ్బా! దీని కేమి ప్రత్యుత్తర మిత్తును. (భుజము తడవుకొనుచు) ఏమిది ? గాఢపరీక్షావిధానసమయమున నా మన మన్యథా భుజముపై కేల పోవలయును ? దీని కేమి కారణమైయుండును ? (మరల భుజము వైపు చూచుకొని యాశ్చర్యముతో) సృష్టిలోని ప్రతి వస్తువు నేదియో యొక ప్రయోజన సాధకమే కదా ?

ఉద——(పటకాండమును దీసివేసి) అహహా! ఏమి యాశ్చర్యము! అలనాఁడా యుద్యానవనంబున నాకు నేత్రోత్సవం బొనర్చి నా మనస్సాకర్షించిన లతాంగియే యీమె! నా మనోహారిణియే శిష్యురాలయ్యె! శిష్యురాలే మనోహారిణియయ్యె. ఏమి నా భాగ్యము. సుదతీ! ... (వాసవదత్త ముఖము ద్రిప్పవాల్పక చూచును.)

వాస——(సిగ్గుచే నోలమాసగొనును.)

ఉద——(నిశ్చేష్టుఁడగును.) బళిరే! ఇట్టి నిర్మల సౌందర్య వయోవిలాసవిభవంబులు విలోకించిన సన్యాసులేని భావభవాస్త్ర సంచలితస్వాంతులు గాకుందురే? ఈ భువనైకసుందరి యీ యఖండతేజోనిధి యీ భామాశిరోమణి యీ యపరశారద యీ యఖిలలోకాతీతవిలాసవిభ్రమకళాప్రభాంచద్ధవళాక్షీ మధురాధరసుధాధారావారంబు గ్రోల కేరీతి మనగల్గుదును! (లేచి ముందునకుఁ బోయి, యటునిటుచూచి) ఈ విద్యావిశారద సిగ్గుచేఁ బారిపోయెఁ గావలయు. ఆహా! ఏమి యీ సౌందర్యవిభవము!

చ. తరుణి ముఖంబు చందురుఁడు దవ్వులనుండియుఁజూచిచూచి దు
ష్కరమగు నీర్ష్య దోప నిజభవ్యకళావళిఁ బెంచిపెంచి యొ
క్కరణిని నీడురామిని వగంగొని తా బడుగయ్యెఁగాని-చోఁ
బరఁగఁగ నేటి కంతటి ప్రభానిధికిం దిగదీత యీగతిన్.

అహహా!

సీ. వదనమా ? యది కాదు ! పర్వేందుబింబమో ?
దర్పణంబో ? కాక తామరసమొ ?
చూపులా ? యవి కావు ! శ్రీపుత్త్రు దూపులో ?
కమలమ్ములో ? కాక గండుమీలొ ?
భుజములా ? యవి కావు పుష్పదామమ్ములో ?
తమ్మితూండ్లో ? కాక తరుణలతలొ ?
అధరమా ? యది కాదు మధురసాధారమో ?
పద్మరాగమొ? కాక పల్లవంబొ ?
గీ. వళులు గావవి ! వీచికావళులు గాని !
కచకదంబము గాదది ! ఘనము గాని !
పదము గాదది ! నవపల్లవంబు గాని !
కొమ్మ గాదది ! పసిఁడి కీల్బొమ్మ గాని !

ఆ త్రిజగన్మోహనమహౌషధీలతిక యెందరిగినదో చూచెద. (ఆమె పోయిన మార్గమునఁ బోవును.)

[ చండభానుఁడు ప్రవేశించును. ]

చండ.—నా యంతరంగ రంగస్థలానంతర దురాలోచనసర్తకి నోరులకుఁ బాడగట్టనీక నేనే కలుగఁజేసికొని వీరిరువు రొకరినొకరు చూచుకొనకుండఁ గనిపెట్టు సుద్యోగంబు సంపాదించితిని. మానుషంబు గలిగిన మనుజుఁడు పరిభవించిన శాత్రవు నుక్కడంప కూరకుండునా ? ఎప్పుడు మంచిసమయము బ్బు నెప్పుడా యుదయనునిపైఁ గసిదీర్చుకొందునని వేయి

దేముళ్లకు మ్రొక్కుచున్న నన్నా దయామయుండు నేటి కనుగ్రహించె. ఉదయనా! నా పాలిటి నీవే దండధరుఁడ వో నీపాలిటి నేనే దండధరుఁడనో యిప్పు డెఱుంగుదువు గాక! (యోజించి) ఇంచువిల్కాని బాణసంచయముల సంచలితస్వాంతుఁడగు నీతని నెట్లైనను గొనిపోవచ్చును. పిదప రాజుకడఁ జెప్పవలసినవెల్ల నెల్లభంగులఁ జెప్పి యుతి శిక్ష వేయించి నన్నలుముకొనిన చింతాజ్వరంబు నిశ్శేషం బుగా మాన్పుకొనకుందునే? (ఉదయనుఁడు వోయిన దెస వోవును.)

---

## తృతీయరంగము.



వాసవదత్త మందిరము.

[ వాసవదత్త వత్సరాజు చిత్రఫలకముఁ జేతఁగొని ప్రవేశించును. ]

వాస—ఈ రాజును బోలిన రాజీధరామండలమునఁ గలఁడే!

ఉ. కంతుఁడు రూపమందు సుమకాంతుఁడు రంజనయందు భోగభృ
త్కాంతుఁడుసూక్తియందుసురకాంతుఁడుభోగములందుఁబద్మినీ
కాంతుఁడు తేజమందు రఘుకాంతుఁడు శౌర్యమునందు శ్రీసతీ
కాంతుఁడు రక్షయందు మహిఁ గాంతుమె? యీతనిఁ బోలు
భూపులన్. ]

ఆహా! వీని సోయగమేమందును?

సీ. మేలమాడఁగఁబోలు! ఫాలనేత్రునికంటె
కగ్గంబుగాని సూనాస్త్రుతోడ
వియ్యమందఁగ నేర్చు! వీరభద్రుని కోప
వహ్నిఁ గందని నిశాభర్తతోడఁ
గలహింపఁగాఁజాలుఁ! గలశోద్భవుని ధాటి
కణఁగారకుండు వింధ్యాద్రితోడ
నవఘళింపఁగఁజాలు నర్కాన్వయుని మేటి
ములికి కడలని సముద్రుతోడ
గీ. మూర్తియందును సత్కళాస్ఫూర్తియందు
ధైర్యమందును విపుల గాంభీర్యమందు
నఖిలవిశ్వంభరాభర్త్రైకదక్షుఁ
డీ యుదయనభూపాలకుం డెన తెసామ్మొ ?

ఔరా!

ఉ. ఏమని నా మనస్థితిని నీతని కే నెఱిఁగించుదాన! నా
పైఁ మనసొగ్గి నన్ను చెయివట్టి గ్రహించునొ? లేదొ? మాయురే
భామలకెందులేదు గురుభావమటంచును నింద సల్పునో ?
నా మది యిట్టి సంశయమునం బడి యూఁగఁగఁజొచ్చె నిట్టటుల్

అజ్జారే! (నిట్టూర్పువిడిచి) ఈ నృపతిశేఖరు చక్కదనంబు ప్రత్యక్షంబున నీక్షించినంత ననంగనిశితవిస్ఫుటచటులోగ్రబిసప్రసూన శరసంఘాతంబు నా హృత్పుటంబున గాఢంబుగ నాఁటె. (మూర్ఛపోవును.)

[ఇందిరా రాజముఖులు ప్రవేశింతురు]

రాజ—నేఁడు మన నెచ్చెలి విద్యానంతరము మనలను గలుసుకొనలే

ఇంది—ఏమో? నాకును జాల చిత్రముగానే యున్నది. ఎప్పుడును మనలను విడువక యొక మాటయైనను దాఁచక సంచరించు నామె నేఁడు కనుపించనూలేదు. గజశాస్త్రచర్చాంశములఁ జెప్పనూ లేదు.

రాజ—మందిరమునకుఁ బోయి మనమే కలుసుకొందము రమ్ము.

ఇంది—సదువుము. (ఇరువురు వాసవదత్తను సమీపింతురు)

ఇంది—(మూర్ఛాక్రాంతయగు వాసవదత్తను చూచి తత్తరముతో) ఏమిది? ఈమె మూర్ఛనొందినదే!

రాజ—అయ్యో! అసలే పెద్ద యభిమాన మీమెకు. నేటి చర్చాంశముల కోడిపోయి యే యపాయమునకు నొడిగట్టలేదుకద!

ఇంది—(వాసవదత్తను బరిశీలించి చూచి నవ్వుచు) చాలు! చాలు! ఈ చిహ్నములన్నియు సరిగా గుర్తించవే! ఆ పైని నీకే బోధపడఁగలదు.

రాజ—ఏ చిహ్నములు?

ఇంది—ఈ కార్శ్యదేహంబును నీ వేఁడినిట్టూర్పులును నీకించిత్పాండిమచ్ఛాయయు...

రాజ—(పరిశీలించిచూచి) బలే! నీ యూహ బాగాసరిపోయినదే!

నేఁ డుద్యానవన విహారప్రసంగాదినుండియు గురుఁడనుటకు బదులు వరుఁడనుటయే మొదలుపెట్టినది.

ఇంది—ఇంక నాలసింపనేల? శిశిరోపచారములు సేయుదము.

రాజ—లేఁదామరపాకుఁ దెచ్చి వీవనఁ బట్టును)

ఇంది—(చందనకరంబుతో నామెను స్పృశించును)

వాస—నాథా! నన్ను ముట్టకుము! నన్ను ముట్టకుము!

ఇంది—(నవ్వును)

రాజ—చెలీ! ఈమె కందర్పజ్వరదందహ్యమాన మానసురాలై యొడలొక్కింతయు నెఱుంగకున్నది.

ఇంది—నెచ్చెలీ! నీవుపోయి యించుకనీహారమును దెమ్ము.

వాస—(ఇటునటు కదలును)

రాజ—వాసవదత్తా! వాసవదత్తా! నీకు నీహారమొసంగుదునా?

వాస—(కొంచెము తెలివి నటించి కన్దెఱచి) నాథా! ఏదీ! ఏదీ! నీ హారమంటివి. (లేచికూర్చుండును.)

ఇంది—నెచ్చెలీ! తాపతప్తవై యుండుటచే రాజముఖిని నీహారబిందువులఁ దెమ్మంటినే

వాస—(తనలో) ఎంత నగుఁబాటు. ఈ చెలికత్తె లేమనుకొందురో! (ప్రకాశముగా) చెలులారా!... (వాయుస్పర్శ నభినయించి) అబ్బా! ఈ చలపాది తెమ్మెర యెంతదుస్సహాముగా నున్నది?

రాజ—నాగేశ్వరుఁడు దాని పొగరణఁపఁగలఁడులే!

వాస—(తాపముతో) ఔరా! ఈ పాడుతుమ్మెదలు జుమ్ము జుమ్మని రొదసేయుచునెంత బాధించుచున్నవి. (నిట్టూర్పు విడిచి) కట్టా!

ఉ. అంచితమైనవర్షసమయమ్ము గతించె హిమాంశుఁడున్నతిన్
గాంచెఁ బటీరశైలపవనమ్ములు వీఁచె మిళిందఝాంకృతుల్
మించె ఘటించెఁ జాపమున మీనపతాకుఁడు సాయకమ్ము నీ
పంచమహాగ్నికీలలకుఁ బాలయి యింక మనంగ వచ్చునే!

(తెరలో) కట్టా! ఉదయనమహీపాలున కురిశిక్షయా! ఉదయన మహీపాలున కురిశిక్షయా! ఎంత ఘోరమెంత ఘోరము!

వాస—(ఉలికిపడి క్రిందకుదిగి చెవులుమూసుకొని) ఇందిరా! ఇందిరా! ఏమియీపాడువార్త—

ఇంది—(దైన్యముతో) ఏమో నాకును దెలియరాకున్నది.

రాజ—పోయి తెలుసుకొందము.

వాస—సత్వరము పోయి తెలుసుకొనవలయును. సహుపుడు! సహువుడు!! (అందఱును నిష్క్రమింతురు)

పంచమాంకము సమాప్తము.



శ్రీ

# వాసవదత్త

## షష్ఠాంకము.



### ప్రథమరంగము.

[ వాసవదత్త విచారముతోఁ బ్రవేశించును. ]

వాస—ఔరా! పిల్లికిఁ జెల్గాటంబును నెలుకకుఁ బ్రాణసంకటము నన్న సామెతగా నయ్యెఁగదా నాబ్రదుకు. ఉదయనభూపా! శుండిశాస్త్రపారంగతప్రదీపా! క్షత్రియకులాలంకారా! సుకుమారమారశరీరా! నీవు లేకున్న నరనిముసమైన జీవించియుండఁగలనా? నీ యవస్థను దలంచుకొనినచో నా హృదయము వ్రక్కలగుచున్నది. కట్టా! మన్మనఃఫలక ముద్రితమైన నీ యభిరామ చిత్రఫలకంబు నూడఁబెఱుక నా హారిహారాదులకైనఁ దరంబే? అయ్యో! తండ్రీ! అట్టి రూపవంతుని నట్టి సుగుణవంతుని నట్టి గజశాస్త్రపారంగతుని నట్టి సర్వకళానిధిని ... వ ... వ ... ధించు ... ముని

యాజ్ఞాపింప నీమన సెట్లొప్పె. వైరుల పట్ల భూపతులు విపులకర్కశశిలాసదృశహృదయులనుమాట నీయెడఁ దథ్యంబయ్యె. కట్టా ! నా మనోహరు నెట్లు ప్రోతు ? అతని నేగతి రక్షింతు ? నా తండ్రి కడకేగి యా మహీకాంతుని రక్షింపుమని వేఁడుకొందునా ? అయ్యో ! వైరికాననదవానలుండును ప్రతిజ్ఞాపరిపాలనాసక్తుండునగు నాతఁడు నా ప్రార్థన మంగీకరించునా ? నన్నల్లారుముద్దుగాఁ బెంచుకొనుచు నిరంతరము నా సంతసమునే కోరునాతఁడంగీకరింపకుండఁడు. (ఆలోచన నభినయించి) ఏమినావెఱ్ఱి ! అట్లయిన నీవఱకే నన్నా మహాగుణగణ్యునకిచ్చి పరిణయం బొనరించియుండునుగాని యిన్నాళ్లీపటకాండాదికృత్రిమనటనల నెందుకు ప్రదర్శించియుండు. ఆశలకైన నంతంబు గలదు గాని యాతని యాశల కంతంబు లేదు. చతుస్సాగరమేఖలావృత విశ్వంభరావలయ సామ్రాజ్యంబు నేకూరి సకలైశ్వర్యముల చేఁ దులఁదూగుచున్నను నతని దాహంబు తీరదు. నా ప్రాణ ప్రియునెల్లను నిర్జించి యా రాజ్యంబు నాక్రమించుకొనవలయునను దురాశ యతని కుండి యుండవలయు. కాన నా ప్రార్థన మంగీకరింపఁడనుమాట నిజము. అంగీకరింపఁడు సరి కదా ! క్రోధానలదందహ్యమానమానసుండై "నీవును నా శత్రుపక్షంబు నేరుదువా" యని నన్నుఁగూడ దండింపఁ గడంగు. (యోజించి) ఆ ! అట్లయినను యుక్తమే నతులు

పతులతోఁ బోవుట యుత్తమపద్ధతియేకదా ! (నిట్టూర్పు విడిచి తెలివి నటించి) ఎంత మందబుద్ధి గలదాన నగుచుంటిని. వత్సరాజు మ ... ర ... ణించుటయుఁబిదప సతిని ననుసరించుటయునా ? ఆ నిరపరాధుని దుస్థితికిఁ గారణభూతులెవరు ? నా పోయగమే కారణము. నేనే కారణభూతురాలను. అతని ప్రాణంబు లెట్లైనఁ గాపాడకున్న ఘోర నరకకూపంబునఁ గుతిలపడుదానను. రక్షించుటకు మార్గ మెయ్యది ? (యోజించి) నిరపరాధియు నిఖిలవిద్యాసంపన్నుండునగు రాజేంద్రుఁడు మా దేశము వచ్చి యాపద నెందియున్నపుడు డాతని రక్షణార్థమై వెరపూహింప శ్లాఘాపాత్రముగదా ! అయ్యో ! దైవమా ! ఆర్తత్రాణపరాయణుండవని నీకు బిరుదునామమున్న దే ! అబలను-అసహాయను-అల్పజ్ఞను-పతిప్రాణరక్షణోపాయాన్వేషణ నిరంతరచింతా సముద్రనిమగ్నమానసను నన్నుఁజూచి నా యవస్థఁ దిలకించి నా మొఱాలకించి నా నాథుని రక్షించు నుపాయంబు దోపింపలేవా ? సర్వచక్షుఁడవగు నీకు నా దుస్థితి పొడగట్టుటలేదా ? సర్వశక్తుఁడవు నీవు చేయరాని దేదికలదు ? మున్నెందర నాపన్నులను గాపాడలేదు ? దీనబంధూ ! దయాసింధూ ! ఆలోచనామృతరసంబు నాహృదయపద్మంబునఁ జిలికి విపదబ్ధి మునింగిన నన్నొక దరిఁ జేర్పుము. (నిమీలితనయనయై ధ్యానించును. కృష్ణుఁడు ప్రత్యక్షమై

యంతర్ధానమునొందినట్లు భావించి కనులు తెఱచి) ఆహా! నా భాగ్యమేమందును? దయామయుం డొక్కసారియగు పించి యిట్టే యదృశ్యుఁడైనాఁడు. అబ్బా! (యోజించి) నా ప్రాణం బిప్పటికిఁ గుదుటఁబడినది. భగవంతుఁ డిప్పుడు నా హృదయక్షేత్రమున సంకురింపఁజేసిన యీ యాలోచనాతరణిచే విపత్పారావారంబు నీదఁగలదానను. ఇదె పోయి మన్మనోహర రక్షణార్థము యత్నించెద.

( నిష్క్రమించును. )

---

## ద్వితీయరంగము.

[ ప్రద్యోతన ప్రభాకరులు ప్రవేశింతురు. ]

ప్రభా—రాజేంద్రా! కాళికాలయప్రాంతంబునం దెల్లను వలయు సంభారంబులు కూర్పవలసినదిగాఁ జండభాను వామదేవుల కాజ్ఞాపించినాఁడను. వా రన్నియు రేపుదయమునకే పరిపూర్తి చేయుదురు.

ప్రద్యో—బలపరాక్రమసంపన్నుఁడగు నా వత్సరాజును దగు కట్టుబాటునందుంచితిరిగదా!

ప్రభా—చండపరాక్రముఁడగు చండభానుఁ డతనిని వేయికండ్లఁ గనిపెట్టుచు నేయున్నాఁడు.

ప్రద్యో—మంత్రిశేఖరా! అదేమోకాని నా మనస్సు మనస్సులో లేదు. ఆ సుకుమారశరీరుని నా విద్యాపారంగతుని నాశాపాశబద్ధులమై నిష్కారణముగా నంతమొందింపవలసివచ్చెనుగదా! పాడుదైవమా! ఆనాఁడామదగజంబు బారినుండి నన్ను రక్షించిన యీప్రాణప్రదాతను జంపింపుమని నానుదుట వ్రాసితివా? నే నెంత కృతఘ్నుఁడను!

ప్రభా—రాజా! గజవిద్యాంకురాలమా యుజ్జయినీ మహీతలంబున నాటింపఁ జేసితివి. పగతురనా పట్టి పాలార్చితివి. చతుస్సముద్రముద్రితమైన మీసామ్రాజ్యమునందుఁ జంద్రునకు మధ్య నలునంతనలు....... వంశరాజ్యమను నొక చిన్నపీలిక మిగిలియున్నది. ఉదయను నంతమొందించుటచే వంశరాజ్యంబు నింక నాక్రమించుకొనవచ్చు. ఆపైఁ గొఱంత గోరంతయు నుండఁబోదు.

ప్రద్యో—(నిట్టూర్పువిడిచి) అంతయు ... నీ ... సహాయమున నే కదా!

ప్రభా—ఆవశ్యకమగు కార్యమింకొకటి గలదు.

ప్రద్యో—అదియేమి?

ప్రభా—వంశరాజ్య మాక్రమించుకొనిన వెనుక నుజ్జయిని నుండి ప్రధాననగరము కౌశాంబికి మార్చవలయును. కరము వాసయోగ్యముసుమా కౌశాంబి!

(సేవకుఁడు వచ్చి) దేవా! చండభాస్కంట ద్వారందగ్గిర వేచున్నాఁడు.

ప్రద్యో—ఓరీ! లోనఁ బ్రవేశపెట్టుము.

(చండభానుఁడు ప్రవేశించును)

చండ—దేవా! వందనములు.

ప్రభా—ఈ యాసనమునఁ గూర్చుండుము.

(చండభానుఁడాసీనుఁడగును)

ప్రభా—చండభానూ! రాచకార్యములందుఁ గడు జాగరూకుఁడవై ప్రవర్తించుచుంటివా? క్రొత్తసమాచారంబులేమియు లేవు గదా!

చండ—మీ యాజ్ఞానుసారము వేఁగుల నెల్లచోటుల గూఢంబుగా నిల్పి యందందలి సంగతులను దెలుసుకొనుచునే యున్నాను. ఆ నాఁడు మన సభాస్థానమునకు వచ్చిన శంకరముని మరల వచ్చినాఁడా?

ప్రద్యో—తిరిగి యిప్పు డేటికి వచ్చును? మరల వచ్చిన మీదటికి రాఁగలఁడు.

చండ—అతఁడు శంకరముని యనియేనా మీ యుద్దేశము.

ప్రభా—కాక మఱెవ్వరు?

చండ—(నవ్వి) అతఁ డుదయనభూపాలుని మంత్రి యౌగంధరాయణుఁడు.

ప్రద్యో—(ఆశ్చర్యముతో) ఆ! అదెట్లు?

చండ—మీరు బౌద్ధమతపక్షపాతులనియుఁ దత్సిద్ధాంతబోధకులకు గురువగు శంకర మునీంద్రులవారి నెంతయు గౌరవింతుర

నియు నెఱింగి తద్రూపమున మన యాస్థానమునకువచ్చి నాఁడు మిమ్ముల వంచించినాఁడు.

ప్రభా—(నివ్వెఱపాటునొంది) ఆ! ఏమి ?

ప్రద్యో—(క్రోధముతో) ఓరీ! యౌగంధరాయణా! నీ వెంత కపటముగాఁ బ్రవర్తించితివి? మంత్రిశేఖరా! ముందుగా యౌగంధరాయణునిఁ బట్టి బంధించినఁగాని మనకు జయము చేకూరనేరదు. నిజమైనశంకరమునీంద్రు లెందున్న వారో మన పురగురువులగు జ్యోతిర్విదులవారి నడిగి తెలుసుకొనినచో నవలీలగా నా కపటమునియగు యౌగంధరాయణునిఁ బట్టవచ్చును. అంత మన కార్యంబులన్నియుఁ దేలికగాఁ గాఁగలవు.

చండ—వెండియు యౌగంధరాయణుఁడు నిజపురంబున లేఁడనియు నా రూపంబుననే సంచరించుచు మాయోపాయంబులను పన్నుచుండెననియుఁ గూడఁ దెలియవచ్చినది.

ప్రద్యో—ఓహో! దీనికిం దగునేర్పాటులన్నియు సత్వరము కావింపవలయును.

ప్రభా—చండభానూ! (అతని చెవిలో నేదియో చెప్పును) నీ వీ ప్రకారమాచరించి యతనింబట్టిబంధించి యెప్పటి సమాచారము లప్పుడెఱింగించుచుండవలయును సుమా!

చండ—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

---

-( రాగి )-

# తృతీయాంకము.

ఉజ్జయినీపురప్రాంతము.

[ శంకరముని ప్రవేశించును. ]

శంక — ఔరా! కాలచక్ర మెన్ని భంగులఁ బరిభ్రమించుచున్నది! మా ఱేనికి శుభంబు గాంక్షించి మాయావేషధరుండనై యానాఁడు ప్రద్యోతనుని యాస్థానంబునకుఁ బోయి యేమేమో కల్లబొల్లి మాటలాడి యా వాసవదత్తను వత్సరాజునకుం గలుపఁ బ్రయత్నించి తత్కాలంబున స్వేచ్ఛావిహారంబును విద్యాసంతతము నిర్బంధవిముక్తి విధానమును గూడ గల్పించితిని. నే ననుకొనినట్లె వారిరువురును జూచుకొనుటయుఁ బరస్పరానురాగబద్ధులగుటయుఁ దటస్థించినది. కాని యా దురాత్ముఁడగు ప్రద్యోతనుఁ డింతపని చేయునని కలనైనఁ దలంపనైతి. కష్టా! తా నొకటి తలఁప దైవ మొకటి తలఁచెఁగదా! మా యుదయనుని యవస్థ దలఁచుకొనినంత నా హృదయము వ్రక్కలగుచున్నది. ఓరీ! ప్రద్యోతనా? యౌగంధరాయణుఁడు బ్రతికియుండెనని యెఱుంగవా! వాని కంఠమునఁ బ్రాణంబు లున్నంతవఱకు నుదయనమహీపాలుని యొడలిపైఁ జేయివేయఁగలవా? తులువా! (ఉదయనునిఁ దలంచుకొని) ఉదయనరాజేంద్రా! నీ నవయౌవనవిలాసవిభ్రమంబు లేకటికవాని కక్కటికము గలిగిం

పవు? అట్టియెడ నిన్ను వధింప నాజ్ఞాపించుట కా చెనంటి రాజునకెట్లు నోరాడె? ఉదయనా! నే నేనుఁగును బురిగొల్పి పంపిననాఁడు నీప్రాణకుంఠీయుండినచో నానాఁడే యది వానినిఁ జంపియుండెడిది. నా మనోరథ మప్పుడే యీడేరియుండెడిదికదా! కాదు! కాదు! నీవు నిజముగా మంత్రి యోచితమైన కార్యమొనర్చి ధన్యుండ వైతివి. కృతఘ్నుఁ డెన్నఁడైన బాగుపడునా? అయ్యో! వాని నాశనము మాట యటుండుము. ఇప్పుడు వంశరాజ్య మంతరింప నున్నదే! అపుత్రకుఁడగు ప్రద్యోతనుని కుమార్తెను నీవు పరిణయంబైనచో నా యవంతిరాజ్యంబంతయు నీ వశమగు ననియు వంశావంతిరాజ్యంబులేకమైనచో నీ కీడగు పుడమి లేఁడుండఁ బోఁడనియు నెంచి నే నొనర్చిన యత్నంబులన్నియు బూడిదను వేల్చిన హోమములయ్యె. (నేలపైఁ గూలి విచారించుచు) కాళియఁట ... ఆలయమఁట ... ఉజ... యుని ... వ ... ధ ... మఁట ... అబ్బా! భరింపఁజాల! భరింపఁజాల! (యోచించి) అల్పావకాశమగు నీ సమయంబున నీగతి వాపోవుట నేమిప్రయోజనము? ఆ మహాశక్తి వెనుక భాగంబున నీరేయెల్ల నెట్లో యిముడ్చుకొని యెరికిం గనుపడకుండ నందే దాఁగియుండి తఱివేచి మద్భుజకరకతోరాసిధార నాక్రమింపులకు తలారుల నంగజాను [illegible] ఇంతకెన్ని వేషములు [illegible] కానరా

దు! మీఁద దైవంబు గలఁడు. (కలయఁజూచి) ఆ కాషా యవస్త్రధారియెవ్వఁడు? బౌద్ధమత బోధకునివలెఁ బొడగట్టుచున్నాఁడు. (యోజించి) నావలె మాయావేషము దాల్చి నన్ను వంచించుటకు వచ్చుచున్న ప్రద్యోతనుని మంత్రి కాఁడుగదా! (నిదానించి చూచి) కాఁడు! కాఁడు! అలనాఁ డాస్థానమునఁ జూచిన మంత్రి మోమునకును నితని మోమునకును బోలిక రవ్వంతయు లేదు. ఆయన ననుసరించు నా పిల్లకాయల ముఖలక్షణములనుబట్టి చూచినను నిజమగు శిష్యులవలెఁ గాన్పించుచున్నారు. (లేచి నిలఁబడును.)

(కాషాయవస్త్రధారి చండభానుఁడు శిష్యులతోఁ బ్రవేశించును)

చండ—శిష్యులారా! మీరు జాగరూకులై ప్రవర్తింపవలెనుసుడీ!

శిష్యులు—ఓ! నిమిషంలోకట్టివేస్తాము.

యౌగం—(సమీపించి) మునిచంద్రమా! స్వాగతము!

చండ—ఓహో! మునిసత్తములా! (సాష్టాంగదండప్రణామము సేయును)

యౌగం—(వంగి యతనిని లేవనెత్తును)

(శిష్యులు ప్రక్కలకు వెనుకకుఁ దప్పుకొని రజ్జువులచే యౌగంధరాయణుని బంధింతురు)

యౌగం—(ఆశ్చర్యముతో) ఏమిది? (ఉస్సురని) ఎంతపాపము ఘటిల్లెను? నరేంద్రసచివులిరువురును పరరాష్ట్రింబున బద్ధులైరి

గదా! వంశరాజ్యనాశనమునకే మాకిట్టి బంధనములు సంభవించినవి. కట్టా! ఏమిదారి? (క్రోధముతో) ఓరీ! దురాత్మా! నీవెవ్వఁడవు?

చండ—(నవ్వి) నేను శంకరమునిరూపము ధరించిన యౌగంధరాయణుఁడను.

యౌగం—ఆ! (క్రోధముతో) ఓరీ! కుటిల మార్గానువర్తీ! నీవెవ్వడవు?

శిష్యులు—మేము ప్రద్యోతనమహీపాలుని భటులము.

యౌగం—కట్టా! అనుకొనినట్లే యయ్యెనే

చండ—అనుకొనునట్లే కారాగారము గూడ నీకుఁ బ్రాప్తింపఁగలదు. కపటముని వేషధారీ! రమ్ము! రమ్ము!

యౌగం—ఓరీ! దురాత్మా! వచ్చెదనుగాని వీఁడు యౌగంధరాయణుఁడని మాత్రము తెలిసికొనుము.

చండ—ఈ బింకపుఁ బలుకులకేమిలే రమ్ము రమ్ము.

యౌగం—చూచెదవుగాక నడువుము-

(యౌగంధరాయణునిఁ దీసుకొని పోవుదురు) (నిష్క్రమించును)

## చ తు ర్థ ర ం గ ము.



[ ప్రద్యోతనుఁడాసనాసీనుఁడై ప్రవేశించును. ]

ప్రద్యో—(నిరూపించి చూచి) ఏమిది ? నా యనుంగు కుమార్తె యిటువచ్చుచున్నది! ఉదయనుని మరణమునకై విచారించు

చుండునా ? అట్లుకానేరదు. నా విరోధి నీమెయు బలవద్వి రోధిగానే భావించునుగదా ! ఇంకం బరితాపమేటికో ? గురువుకాన వాని దుర్దశకు విచారించుచుండనోపు. అయి నను బరిశీలించిచూచెద —

వాసవదత్త—(ప్రవేశించి గద్గదముతో) ఎంతటి యుపకృతి-

ప్రద్యో—(ఆమెను దగ్గరకుఁ జేరఁదీసి) ఇదియేమి !

చ. వదనసుధాంశుమండలము వన్నియ దక్కెను నేత్రపద్మముల్
వదలక బాష్పవృష్టి సలిలమ్మునఁ బొంకము వాసె నెల్లు గ
ద్గదమయి తోచెనేల ? ముగుదా ! చతురబ్ధితరంగధూతశు
క్తిదసవమాక్తికోద్వలయదీప్తమహీవలయేంద్రపుత్రికా !

వాస—(విచారము సూచించుచు నూరకుండును.)

ప్రద్యో—కుమారీ ! నీయాజ్ఞ నెవ్వరైనను మీఱిరా ? నీకు వచ్చిన ప్రమాదమేమి ? ఏల దురపిల్లెదవు ?

వాస—తండ్రీ ! ఆ గజశాస్త్రము నీవే నేర్చుకొనినచో నాకిట్టిపాట్లు వాటిల్లకుండునుగదా ! కట్టా ! నన్నవమానోక్తుల పాల్పఱచితివి.

ప్రద్యో—ఏమి ? ఆ దురాత్ము డంతటి యవమానోక్తులాడెనా ?

వాస—(తనలో) ఈతని కెవ్వఁడో తలనిండ విషమెక్కించినాఁడు. కానిమ్ము. (చెవులు మూసుకొని కన్నీరు గార్చుచు, ప్రకాశముగా) అబ్బా! భరింప...జాల ... భరింప ... జాల... అంత నేను కోపపరిభూతస్వాంతనై

గీ. వలదనుచు నేను గోపించి పలుకుచుండఁ
బెండ్లియాడదె ? మున్నల్ల బిల్హణేంద్రు
యామినీపూర్ణతిలక యటంచుఁ బలికి
లోఁగొనఁగఁజూచె నన్నట్టులో యతండు.

ప్రద్యో—(పండ్లుపటపట గొఱుకుచు) ఓరీ ! దురాత్మా ! రేపటి దాక నేల ? ఈసమయంబున నీవు నా యెదుటనున్న నిప్పుడే ఖండించివైచియుందును. సరే ! కుమారీమణీ ! వానికిం దగిన శిక్షయే విధించితినిలే !

వాస—(తనలో) మాత్సర్యయుతులగురాజు లేపనిచేయుటకును వెనుదీయరుగదా ! (ప్రకాశముగా) తండ్రీ ! ఎట్టి శిక్ష విధింపఁబడినది ?

ప్రద్యో—అమ్మాయీ ! కాళీకాలయమంతయు నేఁ డలంకరించుచున్నారు. రేపుదయముననే వానినిఁ దలారులు గొనిపోయి వధ్యశిల నెక్కించి వధింతురు.

వాస—ఈతప్పునకిదియే తగినశిక్షయా ? పాపము సాటిరాజగుటచే యింతకన్నఁ దగిన కఠినశిక్ష మీ కేశాస్త్రమునందును గనుపించలేదు కాఁబోలును.

ప్రద్యో—ఇప్పుడు మించిన దేమున్నది ? నీ యిచ్చవచ్చిన శిక్షవిధించెదను చెప్పుము.

వాస—నిజముగా నీకుమాత్రైకుం జరిగిన యవమానమునకుఁ బ్రతీకారము సేయవలయునను తలంపు నీకుఁ గలదేని యిట్లొనర్పుము.

ప్రద్యో—అవశ్యమట్లే యొనర్చెదను చెప్పుము.

వాస—ఆ యనీతిమంతుని ఆ.హాతలక్షణునిఁ గంటకములపైఁ బరుండఁబెట్టి మత్తగజంబుచేఁ ద్రొక్కించి తండ్రీ ! ఈక్షణముననే వానిని యమస్థానమున కంపవలయు. అది మనము కన్నులారఁ గాంచవలయు. అపుడుగాని నా హృదయకుండమును దహించివేయుచున్న పరిభవాగ్ని జ్వాలామాలికలు చల్లారవు. తండ్రీ ! అర్హశిక్షల విధింపనిరాజులును మహానరకంబునఁ బడుదురుగదా !

ప్రద్యో—కుమారీ ! (యోజించి) ఈశిక్ష యుక్తమేయని తోఁచెడిని. గజశాస్త్రపారంగతుఁడు గజముచేతనే పట్టువడియె. ఎందెవ్వాని కపారకౌశలముండు నందే యాతఁడు భంగపడుటయుఁ బంచత్వమొందుటయును యుక్తమే. అట్లే కావింపుము. కాని కుమారీమణీ ! నేనుమాత్ర మా దృశ్యమును గన్నులారఁ జూడఁజాల.

వాస—ఏమి ! నీ కుమార్తె యవమానమును గన్నులారఁజూడఁ గలవా ?

ప్రద్యో—కుమారీ ! అట్లుకాదు. ఆతఁడొకనాఁడు నన్నొక మదగజము బారినుండి రక్షించె. అట్టి వానిని "వధింపుఁడు ! వధింపుఁడ"ని నేను చెప్పుచుండ నా సమాచారమును జ్ఞప్తికిఁదెచ్చు చూపు నాపై నాతఁడు ప్రసరింపఁజేసిన...అబ్బా! అదియెంత దుర్భరమో యోజించుకొనుము. వలయునేని మంత్రియగు ప్రభాకరు నంపెద.

వాస—ప్రభాకరుఁడేల ? ఈమాత్రపుఁబని నేను చేయింపలేనా ?

ప్రద్యో—అదియేయుక్తము. నీవుండి తత్సంహారంబొనరించిన నే నున్నట్లేకదా ! ఆసమాచారంబు సెప్పి నాకుఁ గర్వోత్సవం బొనరింపుము. (సందేహముతో) కాని కుమారా ! నీకుమా త్రము ప్రాణమెట్లొప్పును ? నీకు గురువుఁగాఁడా ?

వాస—తండ్రీ! గురువైననేమి? నీకహితుఁడు నాకహితుఁడునుగదా

ప్రద్యో—కాకేమి ? సరే ! ఇవన్నియునేల ? ఇదె నా మొహరు. నీ యిచ్చవచ్చినట్లొనరింపుము.

( తెరపడును. )

---

## పంచమరంగము.

ప్రదేశము—మర్గాలయము—వధ్యశిల

[తలారులును శృంఖలాబద్ధుఁడగు వత్సరాజును ప్రవేశింతురు]

వత్సరాజు—హా! జగన్నాటకసూత్రధారీ!ఏమి! నీప్రకృతిలక్షణము. బంట్లొడలు నోడలు బండ్లగున ట్లొనర్చుటయేనా! నిరంతర భవత్పాదారవిందమరందపానతత్పరుండనయిన నాకెట్టికష్ట దశగల్పించితివి!

ఉ. ఎక్కడ వంశరాజ్య మిదియెక్కడ యుజ్జయినీపురంబు దో
ర్దండకృతసర్వచంచదభియాతిభుజామహనీయవిక్రముం
డెక్కడ వత్సరాజు మఱి యెక్కడ యీయపమృత్యు వక్కటా!
మిక్కిలియక్కజంబు పరమేష్ఠివిలాసము లెంచిచూడఁగన్.

ఓకౌశాంబికాపురాధిదేవతా! నన్ను పరరాష్ట్రంబునకంపి చంపింప నెంచితివా! స్వపురంబున స్వగృహంబుననైన మరణించుటకు నోచుకొనలేదా? ఔరా!

గీ. వేఁటనెపమున నను దెచ్చి విపినమునకు
మోహపాశమ్ములను కంఠమునఁ దగిల్చి
ఆ యవంతీశ్వరుండను యమునింబంపి
నన్ను దండింపనెంచెనో నలినభవుఁడు.

జగద్విఖ్యాతమగుపరంతపునివంశము నాతో సంతరింపవలసినదేనా? (నిమీలితనయనుఁడై వాసవదత్తను దలంచుకొని) హా! వాసవదత్తా!...ఏమినా వెత్తు! ఇంకేటివాసవదత్త! ఆమెను జూచినప్పుడుత్పన్నములైననాకోర్కులన్నియు నిప్పు జేటిపాలయిపోయినవి. విమలాంబరచుంబిత సూత్నరత్నవితానాంశుద్యుతిపుంజరంజితసుధప్రభాశోభాయమానసౌధతలాంతరాంతరహంసతూలికా నల్పతల్పరాజంబున నీ కంబుకంఠాలింగనకేళీయూపారవశ్యసుఖసంభ్రమగుంఫనజృంభమాణాభీష్టపరంపరలు మంటఁ గలిసిపోయె. మలయానిలమృదులీలాచలితవివిధసుగంధతరులతాప్రజ్వలితసుమనస్సౌరభ మరందతుందిలద్విరేఫబృంద ఝుంకారారావసంకులనందనోద్యానోపవనంబునఁ దరుణసహకారమూలస్థచంద్రకాంతోపలవేదికాసనాసీనుండనై నావామాంకతలంబున నిన్నిడుకొని నీ యసర్గళాభిరామానుపమానగానామృతధారాసందోహంబును భవదఖండవిద్యావైదుషిప్రకాశితచమత్కారవాక్సుధారసంబును గ్రోలు భాగ్యంబు నష్టేటఁ

గలిసిపోయినది. అయ్యో! అఖండరాజ్యలక్ష్మీవియోగంబునకు విచారింపను బంధుమిత్రసచివాప్తవియోగ విపర్యయంబునకు సంతాపింపను బుద్బుదప్రాయమగు జీవితాశ నాసింపను గాని మహావిభవసంపన్నుండనై ప్రబలారివీరవినిర్జితబాహుబలపరాక్రమకలితుండనై విధికిఁగట్టుపడి పరరాష్ట్రంబున నసహాయుండనై యెట్టిదుర్మరణంబునకుఁ బాల్పడవలసివచ్చునోయనియు బంగారమునకు సవ్వాసికాసపారిజాతప్రసూనసుగంధ మబ్బినవిధంబున ఆవిద్యావిశేషమునకుఁ దగినసౌందర్యమును ఆసౌందర్యమునకుఁ దగినవిద్యావిశేషమునుగల యాత్రిలోకైకసుందరిని ఆనస్యూతప్రఫుల్లకాంచనకేతకీకుసుమగాత్రిని ఆసకలలోకాభినంద్యకళాకలాపమహావశోభితాంగిని ఆవాసవదత్తను బడయలేకపోతిని...పడయలేకపోవుటకుఁగాదు... విద్యావినోదంబులఁ బ్రొద్దుపుచ్చనైతినిగదాయని విచారించుచుంటిని.

చండభానుఁడు—(కోపముతో) ఓరీ! దురాత్మా! (పోడవఁబోయి) విధిలేదువిరామమూలేదు. ఆగోడవేకదా నిన్నింతకుఁదెచ్చినది. అసలునకే మోసమైతే లాభానికి గ్రుద్దులాటయన్నట్టు ప్రాణమేపోవుచుండ నాంచపలచిత్తకై విచారించెదవేల?

ఉద—ఓరీ! పాపీ! నీపూర్వభవపుణ్యఫలమేదో యింకనునిలిచియుండి నిన్నురక్షించుచున్నది. లేకున్న నీ దుర్మార్గమునకుఁ బ్రాయశ్చిత్తమున్నదే! ఓరీ! నీచా! ఈవత్సరాజు చపలచిత్తలకై విచారించువత్సరాజు కాఁడు. మరణమన్నను శంకింపఁడు. మరణమెన్నటికైననున్నదే కాని యుట్టిగట్టుకొని యూ

రేగువారెవ్వరైనను గలరా! బుద్బుదప్రాయమై మాంసశ ల్యావకీర్ణమైన యీతోలుశరీరము నేఁడు గాకున్న నింకనూ తేండ్లకైనను నశింపవలసినదే! ధనధాన్యపుత్రమిత్రకళత్రా దులు పూరుషగళోద్బంధక్రియాపాశములు. లోకమంతయు నొకజూదపుఁబలక. కాలమనుపెనుజూదరి రేయింబవళ్లను పాచికల నాపలకయందు వేగముగా దొర్లింపఁజేయుచు న్నాఁడు. ఏతత్క్రీడావసరంబున నొక్కెడ నొక్కగడియం దొక్కకాయయు నింకొకప్పుడా గడియందే పెక్కుకాయ లును మఱొక్కెడ నందే యేమియు లేకుంటయు సంభ వించును. స్థిరమైనయశశ్శరీరమునకు యత్నింపవలయును గాని యస్థిరమై తృణప్రాయమై చంచలాచపలమగు నీపాడు శరీరమునకు యత్నింపవలయునే? ఓరీ! మూర్ఖా! నీవు విను ము వినకుండుము. మంచిచెడ్డల నిరూపించుట నావిధి. మదాంధుఁడై దుర్మార్గుఁడై కపటక్రియానిర్వాహణధూర్వ హుఁడైన మీగ్రుడ్డిరా జాజ్ఞాపించినంతమాత్రమున మంచి చెడ్డ లరయక యిట్టిదుష్కార్యముల కికమీఁద నైన నొడి గట్టకుము. హత్యయే పాపము. అందును నరహత్య వేయి మడుంగు లెక్కుడుగదా!

వామదేవుడు—చండభానూ! ఏమికంఠం! ఏమిరూపం! ఏమి మాటలురా యీమహారాజువి. ఈ మాటలు వినేటప్పుడికి నా ఒళ్ళు నీరైపోతోంది.

చండ—ఛీ! నోరుముయ్! రాజుగారి యాజ్ఞ మీాఱితేఁ బుఱ్ఱయెగిరిపోతుంది. జాగ్రత్త. ఇదిగో! ఒరే! ఈకాస్త పనీ అయిపోయిందంటే నీకు కొద్దిరోజులలో ఒకఅగ్రహారము ఈనామిస్తానులే!

వామ—నీవెధవఅగ్రహారం నువ్వేఉంచుకో! ఈలాటి దుర్మార్గుఁడగు రాజురాజ్యంలోఉండడం ఈలాటియక్రమపరిపాలనలోఉండడం ఈలాటిచవటరాజురాజ్యంలోఉండడంకంటె చస్తేనయం. ఎటువంటిమహాత్ముని హరహర క్లేశాలుపెట్టినీపొట్టనెట్టుకోవడమునకు ప్రయత్నిస్తున్నావురా! నా ప్రాణమైనా యిచ్చేస్తానుకాని యీాయన్ని నేను చంపను ... చంపనివ్వను ...

చండ—(పండ్లుకొఱుకుచు) ఓరీ! రాజద్రోహీ! (తనలో) వీనిని బ్రతుకనిచ్చినయెడల నా కార్యభంగముకాఁగలదు. (ప్రకాశముగా) నేను చెప్పినట్లు చేయుము. లేకున్న నిన్నేమి చేసెదనో చూడు ...

వామ—నన్ను చంపినినుసరే నేను చెయ్యను.

చండ—(క్రోధముతో, కత్తితో వానినిఁ బొడువఁబోవును.)

వామ—(పారిపోవును.)

ఉద—(కోపముతో) ఓరీ! దురాత్మా! పచ్చిరక్తముద్రాగు పశువువుగాని నీవు మనుష్యుఁడవు కావు.

చండ—ఈపశువింక నీరక్తమునుగూడ యిప్పుడే త్రాగఁగలదు జాగ్రత్త ... ఎక్కుము వధ్యశిలనెక్కుము.

ఉద—(కనులు మూసుకొని) యౌగంధరాయణా! యౌగంధరా
యణా! నీధీవిశేషము నీ బాహుబలము నీ పరాక్రమము...
ఇవన్నియు నేమైపోయినవి ...

చండ—వెఱ్ఱిరాజా! ఇంకెక్కడి యౌగంధరాయణుఁడు. అవన్ని
యుఁ గారాగారములోఁ బడిపోయినవి.

ఉద—(ఆశ్చర్యక్రోధంబులతో) ఆ! ఆతఁడును బందియయ్యెనా?
కట్టా ...

చండ—బందీయగుటయే కాదు. ఉరికూడ కాఁగలదు.

ఉద—హా! హతవిధీ! నావలన నెందరకు ముప్పువాటిల్లినది.
(విజయుని జ్ఞప్తికిఁదెచ్చుకొని) విజయా! విజయా! నీవెంత
పూజ్యుఁడవోయి! వేఁట వ్యసనంబులం దొక్కటనియు నది
వలదనియు నీవెంత బోధించినను దిరస్కరించితినిగదా!
తిరస్కరించితిఁబో నేనేల తత్కాసారతీరంబునకుఁ బోవల
యు! పోయితిఁబో నా మాయాగజజాలంబున నేల చిక్కవ
లయు! ... (నిట్టూర్పు విడిచి) ఏమి వెఱ్ఱి! సర్వమును కాల
వశమున జరుగుచుండునుగదా! చతురంభోధిపరీతభూవలయ
మేకచ్ఛత్రముగా రాజ్యమేలి యఖండయశోమండితులైన
మండలేశ్వరాఖండలు లెందరు గతించిరికారు.

సీ. ఈశ్వరాంశజుఁడైన యినవంశనేతకు
భయదకాంతారప్రవాస మబ్బె
బహువదాన్యుండైన బలిచక్రవర్తికి
బంధురబంధసంబంధ మొదవె

పటుధర్మనిరతులౌ పాండునందనులకు
భూరిరాజ్యంబు గోల్పోక కలిగె
చండారిదావానలుండైన నలునకు
సతితోడి యెడబాటు సంఘటిల్లె
గీ. చండభుజదండకలితకోదండకాండ
కాండఖండితరిపుమండలుండగు నభి
మన్యున కకాలమరణసంప్రాప్తియయ్యె
దైవవైశస మెవ్వారు దాఁటఁగలరు.

చండ—తడవుసేయక వధ్యశిల నెక్కుము

ఉద—ఎవ్వానినామమంత్రోచ్చాటనంబున సకలఘోరకిల్బిషపిశా చంబులు పటాపంచలగునో యెవ్వానిసంస్మరణమాత్రంబున బంధురసంసారబంధనప్రకాండము పుటుక్కున త్రెయ్యునో యట్టిదీనజనావనపరాయణుని భక్తజనమానసోల్లాసిని స్మరింపవలయు నొక్కగడియతాళుము.

చండ—గడియా గిడియా జాంతానై. ఒకఅరగడియయిచ్చాను తెలుచుకో!

ఉద—పోని మ్మంతియేచాలు. (నిమీలితనయనుఁడై ధ్యానించును)

దండకము- శ్రీమన్మహామేరుధీరా! రమామానచోరా! జగద్వంది తాకారశూరా! మునీంద్రాంతరంగాబ్జమిత్రా! పురారాతిమిత్రా! పరంజ్యోతిరూపా! ప్రకీర్ణప్రతాపా! నిరాకారనీరేజపత్రేక్షణా! దేవదేవాదిదేవా! ప్రశాంతస్వభావా! చలత్కాకప

తా! మహోదారవతా! గజేంద్రాసురతా! ఖలధ్వంసదతా! నమోవేదవేద్యా! నమోవిశ్వరూపా! నమోవిశ్వగర్భా! నమోముక్తిదాతా! నమోశక్తిరూపా! నమఃకోటిసూర్యప్రభాభాసమానా! నమోచిన్మయానందవేషా! నమోభక్తపోషా! నమఃకౌస్తుభోద్భాసితాంగా! నమఃకోమలాంగా! నమోధన్యమూర్తీ! నమోలోకవర్తీ! నమోనిర్మలానందకీర్తీ! నమోదేవతాచక్రవర్తీ! నమఃపద్మసంశోభమూర్తీ! నమోతార్క్ష్యవాహోత్తమాంగానువర్తీ! నమోవేదవిద్యారహస్యాదికారాదిఓంకారమూర్తీ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః॥

యౌగంధరాయణుఁడు—(తెరలో) అరరే! నరహత్యారసాస్వాదనపరాయణులారా!

పంచచామరము-దురాత్ములార! క్రూరవృత్తి దుండగంబొనర్తురా!
తరంబె? మీకు రాజుఁజంపఁదాళుఁడియ్యదేమిమున్
గరంబుఁ గూల్చి యింకనీరణక్షమాస్థలిన్ సరా
సరిన్ స్మశానవాటిఁ జేసి శంకరుండనయ్యెదన్.

(కత్తిద్రిప్పుచు యౌగంధరాయణుఁడు వచ్చి చండభాను నొక్కదెబ్బతోఁగ్రిందఁబడవేయును. వత్సరాజు శృంఖలలను ఛేదించును.)

ఉద—(నివ్వెఱపడి) ఏధన్యుని నిశితకృపాణవిలసితకరంబు చూచిన వీరరసమొల్కుచున్నదో యేమహాత్ముని రూపరేఖావిలాసంబులు విలోకింప శాంతరస ముట్టిపడుచున్నదో యట్టి వీరశాంతముల మిశ్రరూపమునకు వందనములు.

యౌగం—రాజేంద్రా! మీకు వందనశతము లొనరించువాఁడను గాని మీచే వందనము చేయించుకొనువాఁడను గాను.

ఉద—ఏమి? భూసురుని పలుకులు చిత్రముగా నున్నవి.

యౌగం—భూసురుఁడను గాను భూసురవేషధరుండనగు యౌగంధ...

ఉద—(ఆత్రముతో గద్గదముతో నానందముతో) ఆ! యౌగంధరాయణా! (కౌఁగలించుకొని) నీ ఋణ మెన్నిజన్మములకైనఁ దీర్చుకొనఁగలనా?

యౌగం—ఇది నా విధాయకకృత్యమే కదా!

ఉద—(ఒడలునిమురుచు నచ్చెరువుతో) ఈకట్టుతాళ్లు యానవాళ్లేమి?

యౌగం—రాజా! ఏమని చెప్పుదును. వంశరాజ్యమునందలి రాచకార్యములఁ జక్కఁబఱచుకొనుచు మధ్యమధ్య శంకరమునిరూపమునఁ బ్రచ్ఛన్నుఁడనై నీయుదంతము సొంతముగా నారయుచుండువాఁడను.

ఉద—(ఆశ్చర్యముతో) శంకరమునిరూపమా? అలనాఁడు ప్రద్యోతనుని యాస్థానమునకు వచ్చిన శంకరమునివి నీవేనా?

యౌగం—(చిరునవ్వునవ్వి) నేనే!

ఉద—(మరల కౌగిలించుకొని) యౌగంధరాయణా! గుర్తింప నాకైనను వలనుపడనిరీతి సంచరించిన నీనైపుణ్యప్రభావమెంతనికొనియాడఁగలను?

యౌగం—నిన్న సాయంసమయమున నుజ్జయినీపురంబు సమీపించుతఱి నిన్నుఁగాళికి బలియిత్తురని...(కౌగిలించుకొని గద్గదముతో)...రాజా...కలనైనఁ దలంపని యెంత దురవస్థ...

ఉద—దైవగతి దాటఁ దరమె?

యౌగం—తెలిసినతోడనే విచారాబ్ధినిమగ్నుఁడనై తదుచితోపాయాంతరాన్వేషణంబునఁదిరుగాడుచుండఁ బ్రద్యోతనుని భటులు...ఔరా! దైవమాయ...

ఉద—(సంభ్రమముతో) ప్రద్యోతనునిభటులా? ఏమిచేసిరి?

యౌగం—బౌద్ధమతావలంబకులవలెనున్న మునిపిల్లకాయలు వెంటరా నొకయాజానుబాహుఁడగు బౌద్ధుఁడువచ్చి నాకు సాష్టాంగదండప్రణామం బొనరించె. అతఁడు నిజముగా బౌద్ధుఁడే యనుకొని భక్తిపూర్వకముగా లేవనెత్తుచుండ వెనుకనుండి కొందరు కపటపుమునిపిల్లకాయలు తటాలున వలవేయుభంగి రజ్జువుల వేసి నన్ను బంధించుకొనిపోయి యొకకారాగారమున బంధించిరి.

ఉద—అయ్యో! మా రాజుతో పాటు నీకును పాశబంధనప్రాప్తి కలిగినదా! ఎట్లు తప్పించుకొని వచ్చితివి?

చండ—(కొంచెముస్మృతి కలుగుటచే కదలును.)

యౌగం—అంతఁ జేయునదిలేక విచారించుచు నా కారాగారమునకు చిన్నకిటికీ యొకటి యుండుట చూచి నాబాహుశక్తి వినియోగించి యా జాలకపుటూచలు లాగివేసి ప్రక్కనున్న

ఖైదులోఁ జొచ్చితిని. పాప మందొక బీదబాపనయ్య నవయుచుండుటఁ జూచి యతనితోఁ బ్రసంగింప రా జతనిని నిర్దోషియని నిరూపించెననియు నా రాత్రి నాల్గవజామున విడుదల చేయుదురనియుఁ జెప్పెను. నేనంత తటాలున నతని రెండుచేతులను బట్టుకొని నిరపరాధి ... యగు మా రాజున కిట్టియవస్థ ఘటిల్లె. ఆతని విడిపింపఁబోవు నాపని యిట్టులయ్యె. తడవైన నా మహారాజు మరణించు. ఉదయ మీలోపుననే నేఁబోయి రక్షింపకున్న వంశరాజ్యమంతయు సంతరింపవలసినదే ! రక్షింపుమని వేఁడుకొన నాతఁడు మిక్కిలి విచారించి "మీరింతగా వేఁడవలయునే ? ధర్మపరాయణుండగు నారాజు ప్రాణరక్షణకన్న నాప్రాణంబు లెక్కుడగునే ? నాచేయుపని యానతీయవలయునని వచించినతోడనే నేనుబ్బిపోయి తటాలున నావస్త్రములన్నియుఁదీసి యాతని కలంకరించి యాదుస్తులు నేను ధరించి యెట్లో జాగ్రత్తగా నతనిని నా కారాగారమునకు దింపి బహూకృతిగా వ్రేలి వజ్రపుటుంగరము నిచ్చి నేనందే గుక్కుమిక్కుమనకుండఁ గూర్చుంటిని.

చండ—(నిట్టూర్పువిడిచి, తనలో) నేనే శతఁడబ్బుననుకొంటే యీతఁడు సహస్రుఁడబ్బాయెనే ? ... ఔరా ! జయశర్మా ! ఎంతపనిచేసితివి ? సరే ! నే చనిపోయినవానివలెనే పడియుండెద ...

ఉద.—తరువాత తరువాత ?

యౌగం—(కొంచెము నడుచుచు) అంతలోఁ గారాగారాధిపతి వచ్చి నేనున్న ఖైదుతలుపుదీసి బయటికిఁ దీసుకొనివచ్చి వెను చఱచి “శయశర్మా! అదృష్టవంతుఁడవులే పో” యని యొక్క గెంటు గెంటెను. “అవును నిజమే” యని నేను సమాధానముచెప్పి వచ్చుచుండ నీపురియందు గస్తుతిరుగు నొక్కనిఁగని కరవాలము లాగుకొని వాని నక్కడనే యుక్కడంచి యిటువచ్చితిని.

ఉద.—వహ్వా! ఏమిమంత్రివోయి! కుహనాసచివు లెందరుండిన నేమిలాభము? తట్టెడు గులకరాలకన్న నొకరత్నంబు మేలుగాదె (కనుమూసి తెఱచి) వా ... స ... ఔనుకాని మంత్రిశేఖరా! నీవొనరించు మహోపకారములు మహాపకారములై నెగడుచున్నవోయి. నా ప్రాణంబులు గాపాడి యధికసంతాపంబు నేల కూర్చితివి. ఆ మరణబాధకన్న వాసవదత్తావియోగసంజనితమగు బాధ యధికమగుచున్నది.

ఉ. ముప్పును దప్పుకొంటినని ముచ్చట నందుదమన్న మన్మథుం
డొప్పక గుప్పఁజొచ్చె విశిఖోత్కర మక్కట! వేఁటకానికిం
దప్పి మృగేంద్రుబారిఁ బడి తద్దయు జంకు గజేంద్రునట్టులై
యొప్పెను నాదుచంద మిపు డో సచివాగ్రణి! యేమిచెప్పుదున్

యౌగం—రాజేంద్రా! (ఒకదెసచూపుచు) అల్లదే! కొలను. చల్లనిదై స్పర్శసుఖంబొసంగుచు కమలసుగంధియై నాసికనుదని

యించు దానిం జేరి ముఖప్రక్షాళనాదికృత్యంబు లొనర్చు
కొనివత్తము రమ్ము.

ఉద—అదియుక్తమే ! నడువుము.

యౌగం—(కొలను దెసకుఁ బోవును. ఉదయనుఁడు వెంబడించును.)

చండభానుఁడు—(లేచి) ఔరా ! యౌగంధరాయణా ! ఎంతపని !
అయ్యో ! ఇంకేమున్నది ? వాసవదత్తను చేతులార వదలు
కొందునా? వెఱ్ఱి! ఈ చండభానుకంఠమునఁ బ్రాణమున్నం
తదనుక వాసవదత్త యెక్కడకుఁబోఁగలదు ? ఇట్టియడ్డంకులు
గలుగుననియే నియమితకాలమునకు ముందే యీవధ్యశిల
కావత్సరాజునుఁ గొనివచ్చి వధింప నుద్యమించితిని. కాని
విపరీతమయ్యె. ఇప్పుడు మించిన దేమున్నది ? తోడనే
పోయి సకలవాహినీవాహినులను దోడ్కొంచుకొనివచ్చి దీనికిం
దగిన ప్రతీకారము చేసితీరెదను. (అటునిటు చూచి) అదె
వాసవదత్త యిటు వచ్చుచున్నదే ! వత్సరాజరక్షణార్థము
గావలయు. సరే ! నేనీచాటున నక్కియుండి సమాచారము
బాగరసినవెనుక పోయి (పండ్లు పటపట లాడించుచు) యౌ
గంధరాయణవత్సరాజవాసవదత్తల మచ్చమాపెద ...

( దాఁగియుండును. )

[ వాసవదత్త ప్రవేశించును. ]

వాస—(కలయఁజూచి) ఇచ్చట నెవ్వరును గనుపింపరిదేమి ? ఇంక
ను నామనోహరునిఁ దీసుకొనిరాలేదు కాఁబోలును.

చండ—(తనలో) లేకేమి ? ఒక్కనిముసము తప్పిపోయినదికాని లేకున్న నీపాటికి యమభటులు దీసుకొనిపోయియేయుందురు

వాస—ఆదురాత్ముఁడగు చండభానుఁ డెప్పుడును నెత్తునకుఁ బైయెత్తువేయుచు దుర్మార్గంబు ఘటించుచుండు.

చండ—(మిక్కిలి నవ్వి) ఇప్పుడు నాసంకల్పమును నదియే !

వాస—(కొంచెము దూరము నడిచి) ఈ వధ్యస్థలాంతర మెంత భయంకరముగా నున్నది. ఔరా ! కాళికాలయాలంకార నిర్మాణంబులన్నియు నా మనోహరునివధకై నూతనముగా నాకటికవానిచే నిర్మింపఁబడినవేనా ! ఎంతదారుణ మెంత దారుణము ! నిరుపమాన సుందరుని నిఖిలకళాకోవిదుని మన్మనోహరునిఁ జంపఁ దెచ్చిన యాదుర్మార్గుఁ డాక్రూరుఁడగు చండభానుఁ డెందున్నవాఁడు.

చండ—(తనలో) ఇందేయున్నవాఁడు.

వాస—ఓరీ ! చండభానూ ! నీవొనరించిన దుర్మార్గములకుఁ గుత్సితతంత్రములకు ఘోరకార్యములకు (కోపముతో నొరనుండి కత్తిదీసి) మత్కరాగ్రప్రతాపదీపితచ్ఛటాభీలవిశంకటఖడ్గధారాహతునిఁ జేయకూరకుందునా —

ఇందిర—(ప్రవేశించి) చెలీ ! చెలీ ! నీ నాథుఁడు రక్షింపఁబడె ! నీ నాథుఁడు రక్షింపఁబడె !

చండ—(తనలో) ఓసి దండుముండా ! నీవెక్కడనుండి వచ్చితివే ?

వాస—(తొందరపాటునొందిన యానందముతో) నిజమా ! ఎవరిచేత ? ఎక్కడ ? ఎక్కడ ?

ఇంది.—అపరబృహస్పతియగు మంత్రియౌగంధరాయణునిచే —

వాస.—ఎట్లు ? ఎట్లు ?

ఇంది.—ఎట్లో చూడుము మదిగో ! ఆకొలనునుండి యింద్రబృహస్పతులవలె వత్సరాజయౌగంధరాయణు లిచే వచ్చుచున్నారు.

వాస.—(చూచి యానందమునొందును.)

[ వత్సరాజ యౌగంధరాయణులు ప్రవేశింతురు. ]

ఇంది.—(వాసవదత్తను వెనుకొని వత్సరాజును సమీపించి) రాజేంద్రా ! ఇదె మా చెలి వాసవదత్త. (ఒకదెస చూపుచు) అల్లదే మత్తమాతంగము. ఈమత్తేభయానకరము గ్రహించి యామత్తేభంబుపై నెక్కి మీపత్తనంబు సుఖంబునఁ జేరుఁడు. (వాసవదత్త కరము వత్సరాజుకరమునకుఁ గీలుగొల్పును. వాసవదత్త సిగ్గుచే తలవంచుకొనును.)

చండ.—(పెదవి గఱచుకొని) ఓపాడుహస్తమా ! ... నీకాభాగ్యములేకపోయెనే ? లేకేమి ? ఏమాత్రము నాలసింపక దీనికిం దగిన ప్రతీకార మొనరించి తీరెద. (తటాలునఁ బోవును.)

వాస.—(సిగ్గుతో) నాథా ! దురంత దుర్దాంతకష్టపరంపర లనుభవించిన పిమ్మట లభించిన నాస్పర్శమేమంత యానందమును గూర్పఁగలదు.

ఉద.—(నవ్వుచు) ప్రేయసీ ! అట్లుకాదు.

చ. గురుతరకష్టపుంజములకుం గడుఁ బాలయియుండి పిమ్మటన్
సరవి ఘటిల్లునట్టి ఘనసౌఖ్యమె సౌఖ్య మనంగఁజెల్లు డె

ష్ణరమగు నెండకాలమునఁ బాయక డస్సిన బాటసారికే
తరువులనీడ సౌఖ్యమును తద్దయుఁగూర్చునుగాదె ప్రేయసీ !

ఇంది—శాత్రవమధ్యంబుననుండి కాలయాపనచేయ నుచితంబు గాదు.

ఉద—సఖీరత్నమా ! మామంత్రిశేఖరుని కరప్రకాశితనిశితంపు టంపరలును మీావాల్గంటి చూపుటంపరలపరంపరలును సహాయంబులైయుండ నే నేశాత్రవుల జయింపఁజాలను.

ఇంది—అని జాగుచేయు టుచితంబే ?

యౌగం—ముందాలోచనగల యీా సుందరి హితమాచరింపవలసినదే. నడువుడు.

( అందఱును నడుతురు — తెరపడును )

షష్ఠాంకము సమాప్తము.



శ్రీ

# వాసవదత్త

## సప్తమాంకము.

(దామోదరుఁడు శంకరుఁడు ప్రవేశింతురు)

దామో—శంకరా! శంకరా! జగంబున నెన్నెన్ని చిత్రంబులను గల్పించుచుంటివిరా! స్త్రీ లెట్టి సాహసకృత్యంబులైనను సలుపుటకు వెనుదీయరుగదా!

శంక—(తెల్లబోయి, తనలో) ఇదేమిటి? వీఁ డిల్లాఅంటున్నాఁడు. నా భార్య యేమియుఁ జేయలేదుకదా కొంపతీసి. (ప్రకాశముగా) దామోదరా! ఏమో వింతగాఁ బలుకుతున్నావు?

దామో—శంకరా! ఏంచెప్పను? పైకి ములుగుపిట్టలులా కనబడుతూ కొంపలు తీయుదురుగదా కోమలులు.

శంక—(తనలో) ఔరా! వీఁడు నా కొంపే ముంచాఁడు. నే నప్పుడప్పుడు నా భార్యను "అదేమే? మాట్లాడవు? ములుగుపిట్టలా ఉంటావు అనే వాడిని. ఆ మాట లెప్పుడో విన్నాఁడు గాఁబోలు దొంగముండాకొడుకు. సరే! వీఁడి రోగం యి

ప్పుడే కుదురుస్తా. (ప్రకాశముగా) ఆ! అయితేను నీ భార్య చాలా మంచిదని విన్నాను. నీ కొంపే ముంచిందా?

దామో—(నవ్వుచు) నా భార్యమాట కాదురా...

శంక—(తనలో) అయ్యో! ఇది విఱుచుకొని నా మీఁదే పడేట ట్టుంది. అయినా యిల్లాంటప్పుడు ధైర్యం నిదానం రెండూ ప్రధానమన్నాఁడో బుద్ధిమంతుఁడు. (ధైర్యము తెచ్చుకొనిన ట్లభినయించి) మరి యెవరిమాటో చెప్పుదూ చంపక

దామో—ఇంత గ్రంథం నడిచినా యింకా పెరటిదారినే ఉన్నావా? గుడ్డిముండాకొడకా!

శంక—(తనలో) ఇంకెందుకు! ఇంకెందుకు! స్పష్టం అయింది. నా కనుగప్పి యేదో సాహసకృత్యం చేసింది నా పెళ్లాంముండ. గుడ్డివాఁడాయని స్పష్టముగా అన్నాఁడు. ఈ యాపద గడు చుట యెల్లాగ. సరే! ఆపదలందు ధైర్యం అన్నాడు. ధైర్యం చిక్కఁబెడతా! (చిక్కఁబెట్టుట నభినయించి ప్రకాశముగా) ఒరే! ప్రాణాలు తీసేస్తున్నావు. అసలు సంగతి చెప్పుదూ.

దామో—చెప్పమంటానా?

శంక—ఎందు కేడిపిస్తావు. త్వరగాఁజెప్పు.

దామో—చెప్పేటందు కేముంది... చెప్పమంటావూ...

శంక—అబ్బా...

దామో—ఇదిగో! మన రాజుగారి కూతురు వాసవదత్త...

శంక—(గుండెరాచుకొనుచు) అమ్మయ్య! బ్రతికానురా బాబూ. ఇప్పటికి నా ప్రాణం కుదుట పడింది. (ప్రకాశముగా) ఊ! ఊ! మన రాజుగారి కూతురు వాసవదత్త...

దామో—రాజుగారి నెట్లో వంచించి భర్తృప్రాణరక్షణార్థమై రూకలసంచిని యేన్గును తీసుకొని పోయినదట.

శంక—ఇదేమిటి? రూకలూ ఏనుఁగూ ప్రాణాన్నిస్తాయిట్రా?

దామో—వెఱ్ఱివాఁడవు. రూకే కాదుట్రా లోకాన్ని సృజించేది పెంచేది లయింపఁజేసేది. రూకలు లేందే నూకలెల్లావస్తాయి. రూక యున్నవాఁడికేగదా లోకంలో సాక్షిగా మాటేది. రూక చేతలేనివాఁడు బ్రహ్మైనా పకీరే. రూక చేతనున్నవాఁడు పకీరైనా బ్రహ్మే. అదునుచేసరి అధమాధముణ్ణైనా తీసుకొనిపోయి అందలంమీఁద కూర్చోపెడతాడు. రూక చేసే చిత్రాలెన్నెన్నో ఉన్నాయి. అవన్నీ యిప్పుడేం చెప్పను. అచ్చంగా మడికట్టుకొని కూర్చున్నవాఁడికైనా ఆశ పుట్టిస్తుంది. రూక చెరపట్టని ఊర్ధ్వస్తంభం. ఆ స్తంభం మీఁదనే లోకభవనం అంతా నిలిచియుంది. అది అటూ యిటూ కాస్త ఊఁగిందంటే లోకం అంతా యిటూఅటూ అయిపోయిందన్నమాటే. వెయ్యేందుకు. రూక లేనివాఁడు లేనివాఁడే.

శంక—ఆ రూక యేంచేసిందో చెప్పు.

దామో—వాసవదత్త యేనుఁగును తీసుకొనిపోయి యా వత్సరాజును దానిపై నెక్కించి కౌశాంబికిఁ దీసుకొనిపోవుచున్నది.

శంక—మన రాజూరుకున్నాఁడురా మరి.

దామో—ఊరుకుంటాఁడూ! వారి సందరిని పట్టి కట్టి తెండని కొంత సైన్యాన్ని పంపించాఁడు. ఆ సేన రావడం చూచి

అఖండబుద్ధిమంతురాలయిన యీ వాసవదత్త యేంచేసిందో చూచావ్రా!

శంక — ఏంచేసిందో చెప్పు! చెప్పు!

దామో — ఆమె యొక రూకలసంచీ వారి ముందు విసిరేసింది.

శంక — అబ్బా! ఎంతపని చేసిందిరా!

దామో — ఏడిచావు. ఆమె ప్రయోజకత్వం ఏముంది?...

శంక — సరేలే! నీ దగ్గిరున్న రోగమేయిది. ఎంత మంచియున్నా మెచ్చుకోకపోవడమే.

దామో — అదికాదురా! అంతా రూకే చేసేసింది. తృష్ణాపరులైన యీ సైనికులా రూక లేరుకొనసాగిరి. ఆ సమయంలో వత్సరాజవాసవదత్తలు కొంతదూరము ముందుకు సాగిరి. అధికార్లింటో సంభావన యిస్తోంటే ఆశపాతకపు టడావిడి బ్రాహ్మడు కుడిచేత్తో సంభావన పుచ్చుకొని (శంకరునిఁబొడిచి) విను మరి పరధ్యానముగా ఉండకు — ఎడమచేయి యెవరూ చూడకుండా అయిదారు చేతులు దాటించి అడుగున పెట్టి మళ్లీ రెండు డబ్బుపరకలు ఏరుకున్నట్లు గబగబా ఆ రూకలన్నీ కుడీ యెడమ చేతులతో నొల్లుకొని వాళ్లని వెంటాడించడం మొదలుపెట్టారు. సమీపించీ సమీపించకుండా ఉండేవేళకి ఆ వాసవదత్త యింకోసంచీ విసిరేసింది.

శంక — ఒరే! ఓ సంచీ అంటే ఏమో అనుకున్నాను. అన్ని రూకలసంచులెల్లా ఒచ్చాయి ఆవిడికి.

దామో—కూతురుమాట నమ్మేసి రాజు తన మొహరున్న ముద్రిక యిచ్చివేసాఁడు. దానిని పట్టుకొని ఆవిడ యిష్టంవచ్చినట్లు అధికారం చలాయించింది.

శంక—(అటుయిటు చూచి) దామోదరా! దామోదరా! అదేమిటి? ఆ ప్రక్కను రేగుచున్న ధరాపరాగం నభోభాగం అంతాకప్పి యెంత యెట్టని వింత చీకట్లు కలిగించుచున్నదో చూడు. ప్రళయం కాదుకదా!

దామో—ఒరే! ఎంతప్రజ్ఞావంతుఁడురా మంత్రియౌగంధరాయణుఁడు! వాసవదత్త యేనుఁగెత్తువేయడం. దూరదృష్టిగల మంత్రి యీవరకే తన కేదే నాపదవచ్చునని యీ కొండగుహాలలో సైన్యాంన్ని దాచి యుంచడం. సరిగా అక్కడికి వెళ్లేటప్పడికే ప్రద్యోతనుని మహాసైన్యం రావడం-ఏమి చమత్కారంగా పనిచేసాడురా.

శంక—ఆహా! ఆ సైన్యం యౌగంధరాయణుఁడు దాచిఉంచినదా.

దామో—(నిరూపించి చూచి) అబ్బో! అదేమి? చూచుచుండగనే ఆ సేనాసముద్రములు రెండును పొంగి పొరలి యొండొంటి నొరసికొనుచున్నవి. (పరిశీలించి) అయ్యో! పాపము! వత్సరాజును చుట్టవేశారు.

శంక—(చూచి) ఔరా! వైరి చేతి కత్తి లాగుకొని విజృంభించి యెంతమందిని పొడిచాడో చూడు వత్సరాజు.

దామో—అహో! ఆ సైన్యం అంతటినీ చక్కగా నడుపుచూ

అపరాశ్వత్థామవలె ఎంత భయంకరముగా యుద్ధము చేయుచున్నాఁడురా! మంత్రి యౌగంధరాయణుఁడు.

శంక—అమ్మబాబో! మనరాజుగారే స్వయంగా కత్తిపట్టి యుద్ధంలో ప్రవేశించాఁడు. ఇంకేముంది? అసలే చండప్రద్యోతుఁడు. వాని ముందర మహామహావాళ్లే చిత్తైపోయారు. వీళ్ళ లెక్కయేమిటి? బోడిలెక్క.

దామో—పిచ్చివాఁడవు. అల్లాకాదు. వత్సరాజంటే ఏమనుకొన్నావు? జయం దుర్లభమనే స్వయంగా కత్తిపట్టాడు మన రాజు. (చూచి) అబ్బా! అబ్బా! గుండెనిబ్బరం గల ముండావాఁడికి నాకే యీ సేన చూస్తే హడలెత్తుతోంది. ఏం వత్సరాజురా! ఒక్క యేనుఁగు నుసుకొలిపి యనేకవందల మందిని చంపాడు. బలే! చూడు! చూడు! మేకలమందలో ఉరుకు సింహమువలె ఆ ఉదయనరాజకంఠీరవుఁడు సేనా మధ్యమునఁబడి యెట్లు చిందర వందర చేయుచున్నాఁడో.

శంక—అరే! (కన్నులు మూసుకొని) నేను చూడలేను. నాకు భయము కలుగుచున్నది.

దామో—అబ్బా! ఆడుదయ్యును వాసవదత్త యుద్ధమందుకూడా అసాధ్యురాలేరా!

శంక—(కనులు తెఱచి చూచి) ఔనౌను. ఒరే! దామోదరా! దాని తస్సాగొయ్యా! ఆ యిందిర చూడు. మంత్రికి దగ్గరగా ఉండి యెంత చాకచక్యంగా పనిచేస్తోందో.

దామో—బళిరే! ఉదయనమహీపాలా! ఏమి నీ యౌదార్యము!

శంక—ఏమి? ఏమి?

దామో—చండశాసనుఁడగు ప్రద్యోతనుఁడు చేజిక్కినను హింసింపక పాపం అలసిపోయినాఁడని గ్రహించి "శ్రమతీర్చుకో" అన్నట్లుగా అతనిని వదలివేసి మరల సేనాసముద్రములో ఉరికి అల్లకల్లోలముచేసి పారవేయుచున్నాఁడు.

శంక—ఎంత ధర్మయుద్ధంరా వత్సరాజుది. (పరిశీలించి) ఒరే! ఒరే! వాళ్లీలాగే వచ్చుచున్నట్లున్నది. నడు నడు. ఈ యడావిడిలో మనమీఁద పడి మన్నికూడా విఱుచుకు తినగలరు.

దామో—పద పద. (నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము.



(ఇందిర ప్రవేశించును)

ఇంది—నేనును నా సామర్థ్యము కొలఁది కొలది సైన్యమును హతము గావించితిని. ఔరా! ఉదయనభూపాలుని పరాక్రమము వర్ణనాతీతము. ఎందఱు ప్రద్యోతను లేతెంచినను వత్సరాజును జయించుట కల్ల! కల్ల! (కొంచెము యోజించి చిరునవ్వునవ్వి) అదేమో కాని యీ యౌగంధరాయణున

కేదే నాపద సంభవించిన నాకుఁ దటస్థమైనట్లే నా మానసము తల్లడిల్లుచుండు. (చూచి) ఆ! ఆతఁడెవఁడు? ప్రభాకరుఁడే! ప్రభాకరా! ఏమి నీ స్వామిభక్తిపరాయణత. శరీరమునుండి రక్తము కారుచున్నను మరల యుద్ధము సేయవచ్చితివా? (ఇంకొక దెస నిరూపించి) వారెవరు? ఒక్కసారిగా యౌగంధరాయణుని మార్గ్గ్యాన్నఁ దలపడుచుండిరి. ఓరీ! పాపులారా! (కత్తి త్రిప్పుచుఁ బోవును)

(రౌద్రాకారముతోఁ బ్రద్యోతనుఁడు ప్రవేశించును)

ప్రద్యో—పారిపోకుఁడు! పారిపోకుఁడు! జయము మనకే చేకూరఁగలదు. వెనుకంజ వేయక పరులపైఁబడి చెండాడుఁడు. ఓరీ! చండభానూ! అనేకయుద్ధములందు జయించిన నీ పరాక్రమమంతయు నేఁడే గంగపాలఁబడినది. ఔరా! ఇరువురు శూరమంధరములచే మాసేనాసముద్రమంతయుఁ దరచఁబడుచున్నది. సైనికులారా! ఇంకను జూచెదరేల? అదే! ఆ కపట క్రియాప్రవర్తనుఁడగు మంత్రినిఁ బట్టుకొనుఁడు. జాగ్రత్త వత్సరాజును సమీపించునప్పుడు. ఇంతటి మహాసేనతో నా యరివీరుల నరికట్టలేని మీప్రతాపములేల? కాల్పనే? చంపుడు! చంపుడు! (కత్తిత్రిప్పుచు నిష్క్రమించును)

ఉదయనుఁడు—(ప్రవేశించి యుత్సాహముతో)

చ. నిలుఁడు నిలుండు నిల్వఁడేఁక నివ్వెఱపాటును బొందనేల? మొక్కలమున మిమ్ములం జెనకి కంఠవిలుంఠన మాచరింతు న

స్గలన నెదుర్పవచ్చియు నెగాదిగ చూచెద వేల భూప? యి
బ్బలితపుఖడ్గధార జము బంటుసుమీ! యిఁక మీదు పాలికిన్.

నేఁడుగదా! మద్భయంకరాస్త్రశస్త్రసామర్థ్యంబు ప్రకటించుట కద నుదొరికినది. నేఁడుగదా! నా చండభుజదండకోదండపాండిత్యంబు ప్రదర్శించుటకుఁ దరుణము లభించినది. నేఁడుగదా! అయ్యబలాజన బలాత్కారియగు చండభాను గర్వనిర్వాపణసమయము తటస్థించినది. (నవ్వి) అతఁడు చండప్రద్యోతుఁడఁట! ఇతఁడు చండభానుఁడఁట! ఏమి వీరి శూరత్వము! వీరత్వము! నేఁడీ "చండ" బిరుదద్వయంబు నూడఁబెఱికి పారవేయించెద. ఓ ప్రద్యోతనా! వత్సరాజుతో యుద్ధమునిన మాయాగజముచేఁ బట్టించుటయనుకొంటివా...

(చండభానుఁడు క్రుద్ధుఁడై ప్రవేశించును)

చండ—ఓరీ! దుర్మతీ! దొరికితివి! దొరికితివి.

ఉద—(నవ్వుచు) ఇది మూఁడవసారి

చండ—చండభానుఁడన నేమనుకొంటివి? ఇప్పుడు నా బారినుండి తప్పించుకొని యెందుఁ బోఁగలవు?

ఉద—చండభానుఁడన నబలల బలాత్కరించు పోటుమానిసి యని యీవఱకే తెలిసికొనియుంటి.

చండ—(తనలో) వీఁడు నన్ను వచోబాణంబులచేతనే చంపుచున్నాఁడు. (ప్రకాశముగా) ఊరక ప్రేలనేల? రమ్ము నిన్నిప్పుడేమిచేసెదనో. (చేయి పట్టుకొనఁ బోవును.)

ఉద—నేను స్త్రీని కాదు. చేయిఁ బట్టుకొనకుము. యుద్ధరంగమునకు నడువుము. నడువుము — (ఇరువురును పోవుదురు.)

[ ప్రద్యోతనుఁడు ప్రవేశించును. ]

ప్రద్యో—ఔరా! ప్రచండాఖండలోగ్గండవజ్రదండఘాతసంఘాతమునకైన నోర్వవచ్చునుగాని వత్సరాట్కఠోరఖడ్గధారకెవ్వఁడును సహింపలేఁడు. గుండెభీతి గలిగించు దండధరుగదా ఖండతాడనపీడనంబులకైన నోర్వవచ్చునేమోకాని యుదయనభూపాలు నద్భుత భయంకర కోదండపాండిత్యంబున కా హరిహరాదులైన నోర్వలేరు. నేటితో నాయాశయంబులన్నియు నిరాశాపాశబద్ధములైనవి ...

[ చండభానుఁడు ప్రవేశించును. ]

ప్రద్యో—చండభానా! నీ కథపటియుద్ధ మేమైనది?

చండ—ఏమని చెప్పుదును? వాని బాణఘాతమునకు శరీరమంతయుఁ దూట్లువడినది. అది సహింపలేక తల ... దాచు...

ప్రద్యో—ఛీ! పిరికిపందా! జయమునొంది బ్రదుకవలయు. లేక యుద్ధమునఁ జావవలయు.

చండ—రాజా! ఎందరైనను జంపునుగాని "ఈ గర్వపోతులకిదే ప్రాయశ్చిత్తమని కాఁబోలు" నతఁడు మనల నిరువురను చావనివ్వఁడు బ్రదుకనివ్వఁడు.

ప్రద్యో—ఏమి? ఎంత పౌరుషహీనవాక్యములు పలుకుచుంటివి? చూడు చూడు మాతఁడీదెసకే వచ్చుచున్నట్లున్నది. నీ వావైపునకు జాగ్రత్తగాఁ దప్పుకొనుము. మన మిరువుర మిరుదెసలనుండి రెండగ్నిహోత్రజ్వాలల మధ్యఁబడి మలమలమాడు మృగమువలె నెట్లైన నతఁడు మాడున ట్లొనరింతము.

[ ఉదయనుఁడు ప్రవేశించును. ]

ఉద—ఓరీ ! పిరికిపందలారా ! ఇంకను నా పరాక్రమంబు నవి చూచెదరా ?

గీ. ఎవ్వ రడ్డంబు వచ్చిన నేమిలెక్క
నిజనిశితఖడ్గధారచే నేఁడు పేర్చి
జక్కుసర్చితిఁ బరిపంథిజనుల బళిరె !
తగినపనిగ్గాదె మద్భుజాదండమునకు.

(చండప్రద్యోత చండభాను లిరువురు నిరుదెసలకుఁ దప్పుకొందురు. ఉదయనుఁడు మధ్యగా నుండును.)

ప్రద్యో—ఉదయనా! ఇప్పు డెందుకుఁ బోయెదవు?

ఉద—ఖడ్గముచేతనున్నంత సేపు మీరెందఱైన నెందునఁబోవఁజాలరు

(తటాలున యౌగంధరాయణుఁడు ప్రవేశించును)

ఉద—మంత్రిశేఖరా! ఆగు మాగుము. నావ మీ చండబిరుదాభిధానులిర్వురు నొక్కసారిగా నాతోఁ బోరి జయింపవలెనని తహతహపడుచున్నవారు. వీరి యుబలాటంబు తృటిలోఁ దీర్చెద. నీవు మాత్ర మూరకుండుము. ఆ ఖడ్గంబు గూడ నాకిమ్ము.

(యౌగంధరాయణుఁడు ఖడ్గమిచ్చును. ఉదయనుఁడు రెండుచేతుల ఖడ్గంబులంబూని)

ఉద—ఓరీ ! అధన్యయుద్ధప్రవీణులారా! రండు ! రండు ! (యుద్ధరంగమునకుఁబోవుదురు)

(రక్తసిక్తాంగుఁడగు ప్రభాకరుఁడు ప్రవేశించి)

ప్రభా—ఔరా! ఏమి యీయుదయనభూపాలుసాహసము. ఇరువురనొక్కమారు మార్కొని...బళిరే! సవ్యసాచియై ప్రకాశించుచున్నాఁడు. ఎట్లైనను బోయి మా రాజునకుఁ దగిన సహాయ మొసర్పయత్నించెద. (పోవును)

వాస—(ప్రవేశించి చూచి) కట్టా! నా తండ్రి కడుంగడు శ్రమంబాటు నొందియు క్షాత్రతేజంబునకు భంగంబు గలుగునేమోయని యట్లే నిలిచి పోరాడుచున్నవాఁడు. (అటుపోవనభినయించి) నాథా! ఉదయనభూనాథా! జయము నీకే చేకూరె. వారిని విడిచిపెట్టుము! విడిచిపెట్టుము! (పోవును)

(వాసవదత్తయుఁ బ్రద్యోతనుఁడును బ్రవేశింతురు)

ప్రద్యో—కుమారీ! నాకు మార్రివైతివే?

వాస—తండ్రీ! నేనుగాదు. నీ పరరాజ్యకాంక్షయే నిన్నిట్లుచేసినది. ఆ దురాత్ముండగు చండభానుఁడును త్వదీయరాజ్యకాంక్షా పిశాచావేశుఁడై నిన్నీయవస్థకుఁదెచ్చినాఁడు.

(ఇందిరాయగాంధరాయణులు పిదప ప్రభాకరుఁడును వత్తురు. ఉదయనుఁడు చండభానునిజుట్టుపట్టుకొని తీసుకొని వచ్చును.)

ప్రద్యో—(వాసవదత్తతో) నీవు నిన్న సంతగా నీ యుదయను నసీతిమంతుఁడని, యాహతలక్షణుఁడని వానిని! యమస్థానమున కంపవలయునని తూలనాడితివే! ఇదంతయు నీకుత్సితము గాదా?

వాస—నా మనోనాథుని నెట్లు తూలనాడుదును. ఆ మాట లాభాసవచనములుగాని నిజముగా నీ వనుకొనినట్లు విపరీతభావన నాకులేదు. ఇతఁ డీతిబాధలు లేనివాఁడు గాని నీతిలేనివాఁడనికాదు. ఆహతలక్షణుఁడనికాని హతలక్షణుఁడగు. నాతఁడనికాదు. వాని నియమస్థానమున కంపెదనంటిని గాని వానిని యమస్థానమునకనికాదు.

ప్రద్యో—ఏమి నీ వాక్చాతుర్యము ? ఇతఁడు నీకు గురువుగాడా ?

వాస—తండ్రీ ! భర్త భార్య కేడ్గడయగుటచే గురువునగదా ! తప్పేమున్నది ? వెండియు

సీ. మును చిత్రఫలకమ్ము కనులఁ గాంచిన నాఁడె
ప్రీతి నా చిత్త మర్పించుకొంటి
నిఖిలకళాశాలి నీ కూతు పతియౌట
బహుజన్మకృతపుణ్య ఫలమెచుమ్మి
నాఁడునాటికి నాదు నవ్య ప్రణయవల్లి
యల్లిబిల్లిగ నంటి యల్లుకొనియె
అది పూచి పుష్పించి యతిమోదమున నన్ను
ముంచి నేటికి ఫలియించెఁ జుమ్ము

గీ. స్వప్రతాపాగ్నికీలికాభరనిరస్త
చటులరిపువీరపటు భుజాస్తంభగర్వ
పటలగాఢాంధకారుఁడౌ వత్సభూపుఁ
డల్లుఁడౌట త్వదీయ భాగ్యంబు సూవె.

యౌగం—ప్రద్యోతనమహీపాలా ! వంశావంతిరాజ్యంబులు రెంపు నొక్కటి చేయుటయేకదా నీ సంకల్పము. భగవత్సంక

ల్పమును నట్టిదే యయ్యె. నేటికిఁగదా యీ రెండు రాజ్యం
బు లేకమైనది. అఖండవిద్యాపతియు ననుపమాన తేజోవి
రాజితయునగు నీ కుమార్తెయేకదా దానికి ప్రభ్వి.

ఇందిర—మన యందర సంకల్పమునట్టిదే.

ప్రద్యో—ఇందర సంకల్ప మొక్కటైయుండ నన్ను వేఱు సేయనేల?

ప్రభా—పరమేశ్వరుని చైదముల కడ్డున్నదే?

యౌగం—తథాస్తు.

[ జయశర్మ ప్రవేశించును. ]

జయ—అమ్మాయీ! ఇందిరా! యుద్ధములో నెక్కడా నీకు దెబ్బ
లు తగలలేదుకదా! నా జీవితాశాలతకు నీవేకదా ప్రాపు.

ఇంది—(నవ్వుచు) నాన్నగారూ! సుఖముగానే యున్నాను.

యౌగం—(జయశర్మను కౌగిలించుకొనును. అందఱును విభ్రాంతు
లగుదురు.) ఉదయనభూపాలా! వంశావంతిరాజ్యంబుల
నేకీకృతముసేయ సంకల్పించుకొని ప్రచ్ఛన్నవృద్ధ రూపమున
నున్న భగవంతుఁడనుమీ యీ బ్రాహ్మణుఁడు.

ఉద—అట్లనా! (వానినిఁ గౌగిలించుకొని) నీవును మాకు బంధు
కోటిలోని వాఁడవైతివి.

యౌగం—ఈ యుద్ధానంతరము నీ విషయమే యాలోచింపవలయు
నని నిశ్చయించుకొనియుంటిని. నీవే ప్రత్యక్షమైతివి.
అయ్యా! నీకుఁ గారాగారమేల ప్రాప్తించె? నిన్ను నే నా
ఖైదులో దింపివచ్చినపిమ్మట యెట్లు తప్పించుకొంటివి?

జయ—మహాత్ములారా! వాసవదత్త యీ ప్రద్యోతనునకువలెనే

యీా యిందిర నా కేకప్రియపుత్రిక. వాసవదత్తకుఁ బ్రియసఖి. ఈ దురాత్ముండగు చండభానుఁడు ...

చండ—(తలవంచుకొని) అయ్యో! నా గుట్టంతయు నీతఁడు బయలు పెట్టును గాఁబోలును. హా! హతవిధీ! దుర్మార్గ మెప్పటికిని దాగదుగదా! దాగినను కట్టిగుడుపకమానదుగదా! ఇంక నీప్రద్యోతనుఁడు నన్ను బ్రదుకనిచ్చునా?

జయ—ఈ స్వామిద్రోహి నా కుమార్తెను ప్రోద్బలము చేయవలసినదనియు వాసవదత్త నెల్లనఁ దనకు సమకూర్చుయత్నంబు నా కుమార్తె మూలమునఁ జేయవలయుననియు నాకొక యగ్రహారము బహుమానమిచ్చెదననియు వేయేల? సామదానభేదోపాయంబులు నాయెడ నెఱపి నేనెంతకును నొడంబడకున్నఁ జివరకుఁ గారాగారమున బంధించి దండించె. నా కుమార్తె నా యవస్థ దిలకించి నా బంధవిమోచనమునకుఁ బ్రయత్నింప నిన్నరాత్రి నాల్గవజామున నన్ను వదలుదురని కారాగారాధిపతి నిన్న సాయంతనము చెప్పె ఈ యౌగంధరాయణుఁడు నా కారాగారమునఁబ్రవేశించుటయు నా దుస్తులు ధరించి యీతఁడు విముక్తుఁడగుటయు నుదయనేశునిఁ గాపాడుటయుఁ దటస్థించినది. కాని నాకు బంధవిముక్తి గలుగలేదు. ఇయ్యుదయారంభమున నిందిర వాసవదత్తాసమేతయై యుదయనరక్షణార్థము బయలుదేరి వచ్చుచు నేను విడుదలయై రామి నగచివగచి వాసవదత్త

కంతయు నివేదించి యామె దగ్గరనున్న రాజముద్రికాప్రభావంబున నన్నును విడిపించె.

ప్రద్యో—(క్రోధముతో చండభానునిఁజూడవఁబోయి) ఓరీ! పాపీ! మహారాజు కుమార్తెనే యాశించితివా ?

చండ—రాజోత్తములారా! వేయేల ? అనేక యప్రియంబులు వలికి యనేకదుర్మార్గంబు లాచరించితిని. ఈ పాపాత్ము నేమి చేసినను చేయుఁడు.

ప్రద్యో—వత్సరాజా! వానినిఁ జంప కూరకుండెదవేల? చంపుము.

ఉద—వలదు! వలదు! పశ్చాత్తాపతప్తహృదయుఁడగు నీతఁడు దండ్యుఁడుగాఁడు

చండ—వాసవదత్తా! నే నొనరించిన యపరాధమునుక్షమింపుము.

వాస—క్షమింపఁబడితివి. పొమ్ము.

జయ—యౌగంధరాయణా! నీవానాఁడు నా కొసంగిన వజ్రంపుటుంగరమియ్యదియే. (వ్రేలియుంగరమును చూపును)

యౌగం—ఔను. భూసురోత్తమా! నీయిచ్ఛవచ్చినది కోరుకొమ్ము

జయ—నేను పేదవాఁడను. నిష్కళంకవంశమున జన్మించితిని. నా కుమార్తె యిందిర వివాహభారము మీపైఁబెట్టితిని.

వాస—మంత్రిశేఖరా! నా కొక యభీష్టంబు గలదు.

ప్రభా—మీ యభీష్టము నెరవేర్చిన వెనుకఁగదా యితరము —

యౌగం—అవశ్యమట్లే యొనర్చెద.

వాస—ఈ యిందిర కడుంగడు బుద్ధిమంతురాలని నీ వెఱింగియే యుంటివి. నీ వీమె ననుగ్రహించుటయే నాయభీష్టము.

జయ—మహాభాగ్యము. అమ్మాయీ! ఈ యౌగంధరాయణుని వివాహమాడెదవా ?

ఇంది—(సిగ్గుచే తలవంచుకొనును)

వాస—చెలులను బరిహాసముచేయుటకు కాదు. తలయెత్తవే యిందిరా! (ఉదయనునితో) నాథా! ఈ సంకులసమరసమయంబునందు మా యిందిరా యౌగంధరాయణులు పూవుందావివలె నొండొరుల విడువకుండిరి.

ఇంది—వత్సరాజవాసవదత్తల వలెనే...

ప్రద్యో—ఇదియు నవశ్య మాచరణీయమే.

ఉద—యౌగంధరాయణా...

యౌగం—తావిగలపూవు నెవ్వఁడు తలఁదాల్ప నిచ్ఛగింపఁడు!

జయ—తథాస్తు! అల్లుఁడుగారూ! ఈయమూల్యాంగుళీయకరత్నంబును నా కుమారీరత్నంబును మీకు సమర్పించుచుంటిని.

యౌగం—ఈ యుంగరము వలదు. మీరే కైకొనుఁడు.

జయ—పోనిండు. మీసొత్తు మీకడనే యుండును లెండు. అమ్మాయీ! నీవు దీనిని నీ వ్రేల నలంకరింపుము. (ఇచ్చును.)

ప్రద్యో—(వాసవదత్త కరాబ్జము వత్సరాజు చేతనుంచును.)

జయ—(ఇందిర హస్తాబ్జ మాయౌగంధరాయణుని చేత నుంచును)

ప్రద్యో—ఉదయనసార్వభౌమా! నా ప్రియకుమారీమణిని నా సకలరాజ్యరమణిని నీ హస్తగతముచేసితిని. సకలజనగౌరవనీయమైన బౌద్ధభిక్షుకవృత్తి నవలంబించి యిప్పుడు నీ కతంబున ధన్యుఁడనైతి.

